# విషయసూచిక

# మున్నుడి

జ్యోతిషము, రేఖాశాస్త్రము, సంఖ్యా శాస్త్రము ఇవి మూడూ పరస్పరం అల్లుకొని ఉన్న శాస్త్రాలు. క్రీస్తుపూర్వకాలం నుంచి ఈ మూడు శాస్త్రాలూ భారతదేశంలోనూ, గ్రీస్‌దేశం లోనూ ఒకే రకంగా అభివృద్ధి పొందుతూ చాలా ప్రసిద్ధిలోకి వచ్చాయి.

కాని, ఈనాడు ఈ మూడు శాస్త్రాలూ భారతదేశంలో కన్నా పాశ్చాత్యదేశాలలో చాలా అభివృద్ధికి వచ్చాయనాలి. ఈ మూడు శాస్త్రాలను ఆధారంగా పెట్టుకొని అద్భుతంగా ఫలితాలు చెప్పేవారు అమెరికా, బ్రిటన్, జర్మనీ, జపాన్ వంటి దేశాలలో శాస్త్రజ్ఞులున్నారంటే అతిశయోక్తి కాదు.

మానవ భవిష్యత్తును తెలిపే ఈ మూడు శాస్త్రాలూ సమానమే కాని, జ్యోతిషము, రేఖాశాస్త్రము ఈ రెంటి కంటె సంఖ్యా శాస్త్రంలో కొంచెం ప్రత్యేకత ఉన్నది.

జ్యోతిషము, రేఖాశాస్త్రము ఇవి రెండూ భవిష్యత్తును మట్టుకు తెలుపుతాయి. కాని సంఖ్యాశాస్త్రము ఆ భవిష్యత్తును ఎదుర్కొనడానికి కొంతవరకు మార్పు తేవడానికీ చేయవలసిన చర్యలను తెలుపుతుంది.

## సంఖ్యాశాస్త్రం పుట్టుపూర్వోత్తరాలు

ఆకాశంలో సంచరిస్తున్న గ్రహాలకు, ఒకటి మొదలు తొమ్మిది వరకున్న సంఖ్యలకూ సంబంధం ఉన్నదని గుర్తించి, ప్రతియొక్క గ్రహానికీ సంబంధించిన సంఖ్యను నిర్ణయించారు.

ఇలా నిర్ణయించిన వారిలో చల్దియా అనే దేశస్థులు, గ్రీస్ దేశస్థులూ అగ్రగణ్యులని గుర్తించాలి.

తరువాత, గ్రీసుదేశపు వేదాంతియైన పైథాగరస్ ఈ సంఖ్యాశాస్త్రాన్ని అభివృద్ధి చేయడమే కాకుండా, నియమ బద్ధంగా కూడా చేసి మానవ నిత్య జీవితానికి పనికివచ్చే రీతిలో ఈ శాస్త్రాన్ని ప్రచారంలోకి తెచ్చాడు.

## 1 మొదలు 9 వరకు

ప్రపంచంలో ఒకటి మొదలుకొని కోట్లవరకు ఎన్నో సంఖ్యలున్నా, అవన్నీ తొమ్మిది సంఖ్యలు లోపుగానే అణిగి పోతాయి.

## పూజ్యం

పూజ్యం (o) అనే సున్నకు ప్రత్యేకంగా విలువ లేదు. అంటే తతిమ్మా సంఖ్యలతో కలిసినప్పుడే దానికి విలువ ఉంటుంది. అదికూడా, సంఖ్యకు తరువాత వస్తేనే పూజ్యం విలువ కలిగిన దవుతుంది.

ఉదాహరణ: 0 ఇక్కడ విలువ లేదు.

01 ఇక్కడా విలువ లేదు.

10 ఇక్కడ 1 సంఖ్యకు తరువాత రావటం వల్ల విలువ ఉన్నది.

అంచేత, పది మొదలుకొని కోట్లవరకున్న సంఖ్యల్ని ఉప యోగించినప్పుడే పూజ్యానికి విలువ ఉంటుంది.



## ఆధార సంఖ్య, విస్తార సంఖ్య

సంఖ్యలను ఆధార సంఖ్యలనీ, విస్తార సంఖ్యలనీ రెండు విధాలుగా విభజించాలి.

1 మొదలు 9 వరకున్న సంఖ్యలు ఆధార సంఖ్యలు. అనగా ఈ సంఖ్యల్ని ముందూ వెనకా పెడితేనే తతిమ్మా సంఖ్య లన్నీ రూపొందుతాయి. అంటే ఒకటి మొదలు తొమ్మిది వరకు లేకుంటే గొప్ప గొప్ప మొత్తాలు రూపొందవు. అంచేత 1 మొదలు 9 వరకున్న సంఖ్యలు ఆధార సంఖ్యలు.

తొమ్మిదికి పైబడి కోట్ల వరకున్న తతిమ్మా సంఖ్యలన్నీ విస్తార సంఖ్యలు. పైచెప్పిన ఒకటి మొదలుకొని తొమ్మిది వరకున్న సంఖ్యలను వరుసగా వ్రాస్తూ పోతే ఈ సంఖ్యలు విస్తారాన్ని, అనగా వ్యాపకత్వాన్ని పొందుతాయి. అంచేత వీటిని విస్తార సంఖ్యలంటాం.

ఉదా: 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9 = అధార సంఖ్యలు.

10 మొదలుకొని కోట్లవరకు = విస్తార సంఖ్యలు.

న్యూమరాలజీ అనే సంఖ్యా శాస్త్రానికి విస్తార సంఖ్యతో పనిలేదు. దానికి అధార సంఖ్యే అవసరము.

అంటే, అది ఎంత పెద్ద మొత్తంగా ఉన్నా దాన్ని ఆధార సంఖ్యలోకి పరివర్తన చేసుకోవాలి.

ఉదాహరణకు, ఒక విస్తార సంఖ్య 2121970 అని ఉంటే, దీనిని $2+1+2+1+9+7+0=22=2+2=4$ అని 4 అనే ఆధార సంఖ్యలోకి పరివర్తన చేసుకోవాలి.

ఇదేవిధంగా, ఒకరు పుట్టిన తేదీ, నెల, సంవత్సరం వీటి

సంఖ్యల్ని కలిపి ఆధారసంఖ్యకు తెచ్చుకొన్న తరువాతనే వారి భవిష్యత్తును చెప్పడానికి పూనుకోవాలి.

## జ్యోతిషమే ఆధారము

ఒకటి మొదలు తొమ్మిది వరకున్న ఆధార సంఖ్యలు తొమ్మిదింటిని మాత్రం ఈ శాస్త్రంలో పెట్టుకోవడానికి కారణం లేకపోలేదు.

దీనికి జ్యోతిష శాస్త్రంతో సంబంధం ఉన్నదని ముందే చెప్పాం.

12 రాసులు, తొమ్మిది గ్రహాలు, 27 నక్షత్రాలు. ఈ మూటినీ అధారంగా పెట్టుకొని జ్యోతిష శాస్త్రం నడుస్తున్నది.

ఇందున్న విచిత్రాన్ని చూస్తాం:

12 రాసులలో 27 నక్షత్రాలు ఇముడుతాయి. అనగా, ఒక్కొక్క రాశికి $2\frac{1}{4}$ నక్షత్రాలన్నమాట.

ఒక నక్షత్రానికి 4 పాదాలు. $2\frac{1}{4}$ నక్షత్రాలకు 9 పాదాలు. అంటే ఒక్కొక్క రాశిలో 9 నక్షత్ర పాదాలున్నాయి. 12 రాసులకు కలిపి 108 పాదాలు ఉంటాయి.

అనగా —

27 నక్షత్రాలంటే $2+7=9$

108 పాదాలంటే $1+0+8=9$

డిగ్రీలు లెక్క చూసుకొన్ననూ, ఒక రాశికి 30 డిగ్రీలు వంతున 12 రాసులకు 360 డిగ్రీలు. వీటి ఆధారసంఖ్య $3+6+0=9$. ఈ డిగ్రీలను కళలుగా (మినిట్సుగా.) మార్చినా 21600 $2+1+6+0+0=9$ వస్తుంది.



కాబట్టి, గ్రహాలను, రాసులను, నక్షత్రాలను ఆధారంగా పెట్టుకొని మానవ భవిష్యత్తును చెబుతున్న జ్యోతిష శాస్త్రంలో కూడా ఒకటి మొదలు తొమ్మిది వరకున్న సంఖ్యలే ప్రధానంగా కనిపిస్తున్నాయి.

## మూడురకములైన ఆధార సంఖ్యలు

ఈ సంఖ్యా శాస్త్రంలో మూడు రకములైన ఆధార సంఖ్యలను పెట్టుకొని ఫలితాలు చెప్పారు.

(1) పుట్టిన తేదీ సంఖ్య.

(2) పుట్టిన తేది, నెల, సంవత్సరం వీటి సమష్టి సంఖ్య.

(3) ఒకరి పేరులోని అక్షరాలకున్న విలువల సమష్టి సంఖ్య.

(సూచన: ఈ సమష్టి సంఖ్యలు పెద మొత్తంగా ఉంటే ఆధార సంఖ్యగా మార్చుకోవాలి.)

ఉదాహరణ:

ఒకరు పుట్టిన తేది 2-5-1969. పేరు RAMIAH.

(1) తేదీ సంఖ్య — 2

(2) పైతేదీ, నెల, సంవత్సరము వీటి సమష్టి సంఖ్య } $2+5+1+9+6+9=32=3+2=5$

(3) RAMIAH అనే పేరు విలువ

RAMIAH

$214115=14=1+4=5$. అనగా పేరు సంఖ్య 5.

పైవిధంగా, మూడు రకాలుగా ఉన్న సంఖ్యల్ని పెట్టుకొని ఈ సంఖ్యా శాస్త్ర రీత్యా ఫలితాలు చెప్పేవారు.

కాని, మానవ భవిష్యత్తును చెప్పడానికి, పుట్టిన తేదీ మాత్రమే చాలునని సంఖ్యాశాస్త్రజ్ఞులు నిర్ణయించారు. అందుచేత ఈ పుస్తకంలో ప్రతి యొకరి పుట్టిన తేదీని మాత్రం ఆధారంగా పెట్టుకొని ఫలితాలు వ్రాయబడుతాయి.

ఈ ఫలితాలలో ఏదైనా కొంత కనిపిస్తే పుట్టినతేదీ, నెల, సంవత్సరం వీటి ఆధారసంఖ్య రీతిగా వచ్చే ఫలితాలను కూడా కలిపి చూచుకుంటే సరిపోతుంది.

## వధూవరుల పొంతనాలు

పెండ్లి కావలసి ఉన్న ఒక వరుడుకీ, వధువునకూ పెండ్లి పొంతనాలు చూచే పద్ధతి కూడా ఈ పుస్తకంలో ఇవ్వబడింది.

ఈ పొంతనాలను వారువారు పుట్టిన తేది, నెల, సంవత్సరం వీటి సమష్టి సంఖ్యను పెట్టుకొని చూడాలని శాస్త్రజ్ఞులు నిర్ణయించిన మేరకు ఈ పుస్తకంలో కూడా అదే పద్ధతిని అనుసరించాం.

ఈ పొంతనాల పద్ధతిని వధూవరులకు మాత్రమే కాకుండా, వ్యాపార రంగంలోనూ ఇతర రంగాలలోనూ భాగస్వాములు (Partners, share holders etc.), యజమాని - సేవకుడు మొదలైన వారికి కూడా వర్తింప చేసుకోవచ్చును. అలా కలుస్తున్న వారి గుణగణాలను వారు పుట్టిన తేదీనిబట్టి నిర్ణయించుకొని, వారి స్వభావముతో తమ స్వభావాన్ని పోల్చుకొంటూ వారితో పొత్తు పెట్టుకొనడానికి కూడా ఈ భాగం ఉపయోగిస్తుంది.

## పేరు సంఖ్య

ప్రతి మానవుడికీ పేరు ఉన్నది. ఆ పేరు పెట్టటానికి



కారణం మనకు తెలియదు. అది దైవసమ్మతంగా, కర్మాధీనంగా వచ్చిన పేరు. అంచేత ఆ పేరులోని అక్షరాలకున్న విలువనుబట్టి కూడా ఫలితం చెబుతున్నారు.

ఈ పేర్లను ఇంగ్లీషు అక్షరాలలోకి మార్చుకోవాలి. అప్పుడే నవీనకాలపు సంఖ్యాశాస్త్ర రీతిగా ఫలితం చూచుకోవడానికి వీలుంటుంది.

ఉదాహరణకు: ఒకరి పేరు "కే. రామయ్య". దీనిని ఆంగ్లములో వ్రాస్తే K. RAMAIAH అని వ్రాయాలి. మామూలుగా ఈయనగారు ఇలాగే సంతకం చేస్తారు. అంచేత ఈ పేరులోని ఒక్కొక్క అక్షరానికి సంఖ్య ఉన్నది. ఆ సంఖ్యల్ని ఈ క్రింది పట్టికలో చూచుకొందాం: —

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | U | O | F |
| I | K | G | M | H | V | Z | P |
| J | R | L | T | N | W | | |
| Q | | S | | X | | | |
| Y | | | | | | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |

9

ఈ పట్టికనుబట్టి K. రామయ్యకు ఈ క్రింది విధంగా సంఖ్యలను నిర్ణయించుకొందాం: —

K. R A M A I A H
2 2 1 4 1 1 1 5 = 17 = 1 + 7 = 8

అనగా, ఈ పేరు సమష్టిసంఖ్య 8. ఇదే ఈ పేరుగలవారి పేరు సంఖ్య.

అంచేత, (1) పుట్టిన తేదిసంఖ్య (2) పుట్టిన తేదీ, నెల, సంవత్సరం వీటి సమష్టి సంఖ్య (3) పేరు సంఖ్య ఇవి మూడూ సంఖ్యాశాస్త్ర రీతిగా జీవితఫలితాన్ని చెప్పేటప్పుడు పనికివస్తాయి.

ఈ మూడు సంఖ్యలూ ఒకటే సమానంగాకాని అనుకూల సంఖ్యలుగా గాని ఉంటే, అట్టివారికి మంచి చెడ్డలు జరుగబోయే కాలాన్ని నిర్ణయంగా చెప్పడానికి వీలుంటుంది.

ఈ శాస్త్రం తెలిసినవారు, పుట్టిన తేదీనిబట్టి స్వభావాన్ని గుణగణాలు మొదలైనవాటినీ తెలుసుకోవాలనీ, పుట్టినతేది - నెల- సంవత్సరం వీటి సమష్టి సంఖ్యనుబట్టి అదృష్టయోగాలను చూచుకోవాలనీ, పేరుసంఖ్య వల్ల వచ్చే సమష్టి సంఖ్య బాగుంటే పైచెప్పినవాటికి మరింత బలం కలిగిస్తుందనీ నిర్ణయించారు.

అదీగాక, పుట్టినతేదీ సంఖ్య, వాటి సమష్టి సంఖ్య, పేరు సంఖ్య వీటికి సామరస్యం కుదుర్చాలి. ఐతే, పుట్టినతేదీని గాని, పుట్టినతేదీ - నెల - సంవత్సరం వీటి సమష్టి సంఖ్యలను గానీ మార్చడానికి వీలుండదు.

అంచేత, పేరులోని అక్షరాల సమష్టి సంఖ్యను మార్చుకోవచ్చు. అది ఎలాగంటే, పైన ఉదహరించిన K. RAMAIAH అనే పేరులో ఒక అక్షరాన్ని తీసివేయటంగాని చేర్చడంగానీ చేస్తే, వేరే సమష్టిసంఖ్య వస్తుంది. పై చెప్పిన పేరుతో M కు తరువాత ఉన్న A ను తీసివేస్తే సమష్టి సంఖ్య 7 వస్తుంది. K. RAMAYYA అని మార్చితే సమష్టి సంఖ్య
2 2 1 4 1 1 1 1 = 4 వస్తుంది. ఇలాగే తమ పుట్టిన తేదీ సంఖ్య రావటానికి పేరులో కొన్ని మార్పులు చేసుకోవాలి.

## గ్రహప్రీతి – గ్రహశాంతి

ప్రతి సంఖ్యవారూ, తమకు అనుకూలంగా ఉన్న గ్రహాలు మరింత సౌఖ్యాన్నిచ్చేట్లు చేయటానికి, ప్రతికూలంగా ఉన్న గ్రహాలు శాంతించడానికీ ప్రతిదినమూ ప్రార్థనలు, పూజలు



వ్రతాలు అనుష్ఠించవలసిన విధానాలు ఈ పుస్తకంలో ఆయా సంఖ్యల ఫలితాల ఆఖరులో ఉన్నాయి. వాటిని అనుష్ఠించడం ఆస్తికులకు ఎంతైనా అవసరమని ప్రత్యేకంగా చెప్పనవసరం ఉండదు.

ప్రతియొక్కరూ తాము చేసిన, లేదా చేస్తున్న పుణ్యపాప కర్మలకు ఫలితాన్ని అనుభవించే తీరాలి. చెట్టు పెడితే అది ఫలితం ఇస్తుంది. అలాగే కర్మ చేస్తే ఫలితం ఉంటుంది. ఇదియే ఈశ్వర నియతి. ప్రకృతి ధర్మం అని కూడా అనవచ్చు. ఏది ఎట్లయినా, చేసిన కర్మకు ఫలితాన్ని అనుభవించడం తప్పదు.

ఈ కర్మ ఫలితాన్ని ఇచ్చేవాడు ఈశ్వరుడు. భూమండలంలో నివసిస్తున్నవారమైన మనతో ఆకర్షణశక్తి మూలకంగా సంబంధం పెట్టుకొన్న గ్రహాలు, మనకు ఈశ్వర ప్రతినిధులుగా ఆ ఫలితాలను ఇస్తున్నాయి; ఆ ఫలితాలను శాస్త్ర మూలకంగా ముందుగా మనకు సూచిస్తున్నాయి కూడా.

అంచేత, మనతో ప్రత్యక్ష సంబంధం పెట్టుకొన్న గ్రహాలు సంఖ్యాశాస్త్ర (Numerology) రీతిగా గాని, రేఖాశాస్త్ర రీతిగా గాని, జ్యోతిష శాస్త్ర రీతిగా గాని మనకు రాగల అనిష్టాలను సూచిస్తే, గ్రహాలకున్న ఆ ప్రకోపం తగ్గటంకోసం —అంటే గ్రహశాంతి కోసం ప్రార్థనలు చేయాలి. అందుమూలాన మనకు రాగల శ్రమలు తక్కువగా - సహించ గలిగిందిగా మారుతాయి.

అదే మేరకు గ్రహాలు అనుకూలంగా ఉంటే. అవి మరింత అనుకూలతను పొందటంకోసం గ్రహప్రీతికరంగా స్తోత్రపఠనము పారాయణములు చేస్తుండాలి.

దైవ ప్రార్థన ఒక్క హిందువులకు మాత్రమే కాదు. ముసల్మానులు, క్రైస్తవులు, జైన బౌద్ధ మతస్తులు, ఇంకా తదితా

వారందరికీ ఉన్నది. వారు వారు తాము తాము కొలుస్తున్న దేవుణ్ణి వారి వారి భాషలలో ఉన్న స్తోత్రాలతో ప్రార్థించవచ్చు.

ఈ పుస్తకము సకల మతస్థులకీ సంబంధించినది. అయినా హిందూ మతస్థులు ప్రార్థనలు సలపడం కోసం నవగ్రహ స్తోత్రాన్ని మాత్రం ఇస్తున్నాం. తతిమ్మా వారు తమతమ పద్ధతుల రీత్యా దైవ ప్రార్థనలు చేసి సకలక్షేమాలను పొందాలని ప్రార్థిస్తున్నాము.

సర్వే జనాః సుఖినో భవన్తు!

—రచయిత.

---



శ్రీవ్యాస రచితం

# నవగ్రహ స్తోత్రం

[ఈ నవగ్రహ స్తోత్రాన్ని ప్రతిదినము మూడు తూర్లు, లేదా ఒక తూరి చదివితే గ్రహానుగ్రహం వల్ల సర్వ క్షేమాలూ కలుగుతాయి.]

ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయచ ।
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః ॥

## సూర్యుడు

జపా కుసుమ సంకాశం కాశ్యపేయం మహాద్యుతిమ్ ।
తమోఽరిం సర్వ పాపఘ్నం ప్రణతోఽస్మి దివాకరమ్ ॥

## చంద్రుడు

దధి శంఖ తుషారాభం క్షీరోదార్ణవ సంభవమ్ ।
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్ ॥

## కుజుడు

ధరణీగర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్ ।
కుమారం శక్తి హస్తం చ మంగళం ప్రణమామ్యహమ్ ॥

### బుధుడు

ప్రియంగు కలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్।
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్॥

### గురువు

దేవానాం చ ఋషీణాం చ గురుం కాంచన సన్నిభమ్।
బుద్ధి భూతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్॥

### శుక్రుడు

హిమకుంద మృణాలాభం దైత్యానాం పరమం గురుమ్।
సర్వ శాస్త్ర ప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్॥

### శనైశ్చరుడు

నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్।
ఛాయా మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్॥

### రాహువు

అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్య విమర్దనమ్।
సింహికా గర్భసంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్॥

### కేతువు

పలాశ పుష్ప సంకాశం తారకా గ్రహ మస్తకమ్।
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణామామ్యహమ్॥

---

# 1

## ఒకటి సంఖ్య

ఒకటి అనే సంఖ్య తతిమ్మా సంఖ్యలు అన్నింటికి ఆధారమైనది. అనేక ఒక్కట్లు చేరితే గదా అన్ని సంఖ్యలూ ఏర్పడుతున్నాయి। చూడండి —

$$1 + 1 = 2$$
$$2 + 1 = 3$$
$$3 + 1 = 4$$

ఈ విధంగా కోట్లవరకున్న సంఖ్యలన్నీ ఒక్కట్లు అనేకం చేరటం వల్లనే రూపొందుతున్నాయి. అదీగాక, ఒకటి మొదలు తొమ్మిదివరకున్న సంఖ్యలలో ఒకటి సంఖ్యకు విలువ ఎక్కువ.

నిత్య-సత్య-సనాతనమైన పరబ్రహ్మమనే వస్తువు ఒకటే. ప్రపంచమంతా అందులో నుంచే పుట్టింది. అనేకంగా కనిపించేవన్నీ ఒకటిలోనే ఐక్యం కావాలి. అంచేత సంఖ్యలలో ఒకటి మహత్తైనది.

## 1 - సంఖ్య వారు ఎవరు?

ఒక సంవత్సరానికి పన్నెండు నెలలుగదా! ఆ పన్నెండు నెలలను జనవరి మొదలు డిశంబరు వరకని లెక్క పెట్టుకొందాం. ప్రపంచమంతటా వ్యవహారంలో ఉన్నందువల్లనూ, ప్రాచ్య పాశ్చాత్య రేఖా శాస్త్రజ్ఞులు, సంఖ్యా శాస్త్రజ్ఞులు వీరందరూ ఇంగ్లీషు నెలలు, తేదులు వీటినే ఆధారంగా పెట్టుకొని జీవిత ఫలితాలు చెబుతుండడం వల్లనూ మనం కూడా ఇంగ్లీషు తేదులు, నెలలు వీటినే వ్యవహారంలో పెట్టుకొందాం.

అంచేత, పై పన్నెండు నెలలలో ఏ నెలలోనైనాసరే — 1, 10, 19, 28 - ఈ తేదులలో పుట్టినవారిని 1 సంఖ్య గలవారని గుర్తు పెట్టుకోవాలి.

అది ఎలాగంటే — పైచెప్పిన 1, 10, 19, 28 తేదులలో 1 - వ తేది 1 సంఖ్యకు చెందిందనే విషయం స్పష్టమే.

10 - వ తేదీలో సున్నకు ప్రత్యేకంగా విలువ లేదు. అంచేత సున్న తీసివేస్తే ఒకటి మాత్రమే మిగులుతుంది.

19 - వ సంఖ్యను 1 + 9 అని కూడితే 10 వస్తుంది. ఆ 10 లో ఉన్న సున్న తీసివేస్తే 1 మిగులుతుంది.

అలాగే, 28 అనేదాన్ని 2 + 8 అని కూడితే పదే వస్తుంది. సున్న తీసేస్తే మిగిలేది 1 మాత్రమే.

అందుచేత, 1, 10, 19, 28 ఈ నాలుగు తేదులలో పుట్టినవారు ఎవరైనా సరే, వారందరూ ఒకటి సంఖ్యవారని తెలుసుకోవాలి.

## 1 – సంఖ్యకు చెందిన గ్రహము

సూర్యాది నవగ్రహాలలో సూర్యుడు ఒకటి అనే సంఖ్యకు చెందినవాడు. అతడు నవగ్రహాలలో ప్రథముడు ; నాయకుడు



కూడా. సమస్త జీవరాసుల ఆత్మస్వరూపమే సూర్యుడని శాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి.

అంచేత, గ్రహ నాయకుడైన సూర్యుడు సంఖ్యలలో మొదటిదైన ఒకటి సంఖ్యకు చెందినవాడనటం యుక్తిసంగతంగానే ఉన్నది.

ఒకటి సంఖ్యకు చెందిన గ్రహం సూర్యుడవటంవల్ల, ఆ సంఖ్యకు చెందినవారిలో, సూర్యగ్రహానికి జ్యోతిశ్శాస్త్రంలో వివరించి ఉన్న స్వరూపము, స్వభావము, గుణగణాలు ఇవన్నీ ఉంటాయి.

## 1 - సంఖ్య వారి ఆకారము

ఒకటి సంఖ్యవారు మధ్యరకమైన ఎత్తుకలవారుగా ఉంటారు. పొడవైన భుజాలు, ఎత్తైన నొసట వారికుంటాయి. వెంట్రుకలు ప్రకాశవంతంగా మెరుస్తూ దళసరిగా ఉంటాయి. చక్కగా ధనుస్సువలే వంపులు తిరిగిన కనుబొమ్మలు, గట్టిగా ఉన్న పండ్లు వీరికి ఉంటాయి.

## గుణగణాలు

సింహంవంటి పౌరుషము, ధైర్యమూ కలవారు. తమ మనోభావాలను లక్ష్యాలనూ వదలిపెట్టని పట్టుదల స్వభావం కలవారు వీరు. ఇతరులకి తాము అణిగి ఉండడంకంటే, తమకే ఇతరులు అణిగి ఉండాలనే చిత్తవృత్తి కలవారు. అన్నిటియందునూ తామే ముఖ్యపాత్ర వహించే సమర్థత కలవారు. సేవావృత్తి కన్న స్వతంత్ర జీవితం గడపటంలోనే వీరికి ప్రీతి ఎక్కువ.

వీరు ఎక్కువగా మాట్లాడే స్వభావం కలవారు కాదు ఐనా, మాటాడవలసి వస్తే - భావపుష్టితో, ఛలోక్తిగా, హాస్యరస పూరితంగా మాటాడేవారు.

వీరిని సకల కళాప్రపూర్ణు లనవచ్చు. అంటే, ఏ కళ నైననూ, ఏవిద్యనైననూ త్వరలో నేర్చుకొనే నైపుణ్యము, ఉత్సాహమూ వీరికి ఉంటుంది.

పరాయివారి సుఖదుఃఖాలను చూస్తే కరిగి పోయేవారు. వీరి హృదయం స్వచ్ఛంగా ఉంటుంది. కల్లాకపటము లేకుండా అందరితోనూ అన్యోన్యంగా వ్యవహరిస్తారు. దేనినీ రహస్యమని మనసులో దాచిపెట్టుకో లేకుండా ఇతరులకి చెప్పివేస్తారు.

తాము చేసిన తప్పును, ఒప్పునూ ఇతరులకి చెబుతూ, ఎప్పుడూ హృదయాన్ని స్వచ్ఛంగా పెట్టుకోవాలనే ప్రయత్నంతో ఉంటారు. ఈలాటి నిష్కళంక స్వభావు లవటం వల్ల, టక్కర్లు మోసగాళ్ళంటే వారికి గిట్టదు.

తమకు సహాయం చేయాలని కోరుతూ ఇతరుల దగ్గరికి వెళ్ళడం వీరికి చేతకాని పని. కాని, వీరి పరిస్థితి కనిపెట్టి ఎవరైనా సహాయంచేస్తే, ఆ సహాయాన్ని కృతజ్ఞతతో అంగీకరిస్తారు.

తెల్ల వస్త్రాలు ధరించడమంటే వీరికి ఎక్కువ ఆశ.

జన సమూహంలో కంటే ఏకాంతంలో ఉండడమంటే వీరికి ప్రీతి. రాత్రిపూట ముందుగా పడకకు వెళ్లడమంటే వీరికి పట్టదు. ఎప్పుడయినా ఎక్కువ నిద్రపోతే కాలం వ్యర్థమై పోయిందని చింతించేవారు వీరు.

ప్రయాణాలు చేయడ మంటేను, కొండలు అడవులు సెలయేళ్ళు వంటి ప్రకృతి దృశ్యాలను చూడడమంటేను వీరికి మక్కువ ఎక్కువ.



దైవ విశ్వాసం గల ఆస్తికులు వీరు. కాని దైవం మీదే ఆధారపడిన దైవ పిచ్చిగా ఉండరు.

## దాంపత్య జీవితము

వీరికీ కొంచెం ఆలస్యంగానే వివాహం జరుగుతుంది. వీరి కుటుంబ జీవితం అంతగా ఆనందకరంగా ఉండదు. సదాసర్వ కాలమూ దంపతుల మధ్య ఏదో ఒకవిధమైన తగాదాలు పోట్లాటలతో జీవితం గడుస్తుంటుంది.

ముఖ్యంగా, ఈ ఒకటి సంఖ్యవారికి ఒకటి సంఖ్యవారే భార్యగానో భర్తగానో, కుదిరిఉంటే, పైచెప్పిన వ్యవహారాలు ఎక్కువగా ఉంటాయి. అంచేత ఒకటి సంఖ్య వారితో దాంపత్యం కుదుర్చుకోకుండా చూచుకోవాలని సంఖ్యా శాస్త్రం హెచ్చరిక చేస్తున్నది.

## ఆర్థిక పరిస్థితి

వీరికి ఆర్థిక పరిస్థితి తృప్తికరంగా ఉండదు. ఎప్పుడూ డబ్బులకై పాటులు పడుతూ, కొరతలు తీర్చుకోలేక బాధలు పడుతూ ఉంటారు. అవసరానికి పనికివచ్చే రీతిలో వీరి దగ్గర ఎప్పుడూ డబ్బులు చేరి ఉండవు. కాని, ఆర్థిక సౌష్ఠవం కంటే దైవానుగ్రహం వీరికి ఎక్కువగా ఉంటుంది. జీవితాంతంలో వీరు ఒకింత సుఖాలను అనుభవిస్తారు. అంటే, సుమారు 40 ఏండ్లకు పైబడిన తరువాతనే వీరికి ఉద్యోగంలో లేదా వృత్తి వ్యాపారాలలో స్థిరత ఏర్పడుతుంది. అంతవరకు ఒక అనిర్ణిత మైన (నిలకడలేని) జీవితమే సాగుతుంటుంది.

## ఆరోగ్యము

ఒకటి సంఖ్యవారు ఆహార విషయంలో ముందు జాగ్రత్త కలవారు. అందువల్ల, వీరిని కడుపునొప్పి వంటి ఉదరరోగాలు

అంతగా బాధించవు. అయినా వీరిలో పలువురు రొమ్మునొప్పులతో బాధలు పడుతుంటారు. అంతేగాక, వాత పిత్త శ్లేష్మాలనే త్రిధాతువులలో పైత్యానికి సంబంధించిన రోగాలు, ఉష్ణబాధలూ వీరికి అప్పుడప్పుడూ కలుగుతాయి.

ఈ ఒకటి సంఖ్యవారికి కంటి చూపు బాగుండడం అరుదు. వీరిలో చాలామంది పిన్న వయసులోనే కండ్ల జోళ్ళు తగిలించుకోవాల్సిన అవసరం ఏర్పడవచ్చు.

## వృత్తి వ్యాపారాలు

ఒకటి సంఖ్యవారు కొలువులో ఉంటే, ఆఫీసు మేనేజర్లుగా గానీ, ఐ. ఏ. యస్. వంటి గొప్ప అధికారాలు వహించే వారుగా గానీ, ధార్మిక సంస్థల ట్రస్టీలుగా గానీ, ఇంకా ఎక్కువ అధికారము కల ఒక పదవిలో గానీ ఉంటారు. వీరి ఉద్యోగాలు ప్రత్యక్షంగా గవర్నమెంటు ఉద్యోగాలుగా, లేదా గవర్నమెంటుతో ఎక్కువ సంబంధం పెట్టుకొన్నవిగా ఉంటాయి.

## సూర్యుని కాలము

ఆంగ్ల సంవత్సర రీతిగా జూలై 23 వ తేది మొదలు ఆగష్టు 22 వ తేదీ వరకు సూర్యుని కాలము. ఒకటి సంఖ్య గలవారు బహుశః ఈ కాలంలో పుట్టిన వారుగా ఉండవచ్చు. ఆదివారము సూర్యునికి చెందినది. కాల పరిమితిలో ఆరు నెలల కాలము సూర్యునిది. సూర్యుడు పగటిపూట బలం కలవాడు. ఈ విషయాలన్నీ ఒకటి సంఖ్య కలవారితో అన్వయింప చేసుకోవాలి.

## సూర్యుని దేశము

సూర్యుని దిక్కు తూర్పు. ప్రార్థనా స్థలాలు, భోజనశాలలువంటి ప్రదేశాలు సూర్యునికి చెందుతాయి. ఏపని చేసిననూ, ప్రయాణాలు చేసిననూ తూర్పు ముఖంగా మొదలు పెట్టడం మంచిది. కార్యాలయాలలో తూర్పు ముఖంగా కూర్చోడం అధికార వృద్ధిని ఇస్తుంది.



## సూర్యుని రత్నము

శాస్త్రాలలో మాణిక్యము సూర్యునికై విధించిన రత్నము. ఈ రత్నాన్ని ధరించడం విజయాన్నిస్తుంది. మాణిక్య రత్నం దొరకడం కష్టం. అంచేత, పసుపుడాలు కొడుతున్న వజ్రరత్నాన్ని ఉంగరంలోకాని మెడ గొలుసులోకానీ పొదిగించి ధరిస్తే సర్వ కార్యాలలో విజయమే సిద్ధిస్తుంది. తామ్రము (ఇత్తడి) సూర్యునికి చెందిన లోహము.

## సూర్యుని వర్ణము

సాయంకాల సూర్యుని ప్రకాశంవంటి ఎరుపు వర్ణమే సూర్య గ్రహానికి వర్ణము. ఈ వర్ణముకల ఆభరణాలను వస్త్రాలనూ ఒకటి సంఖ్య వారు ధరిస్తే చాలా మంచిది.

## అనుకూలమైన తేదులు

ఒకటి సంఖ్యవారికి, ప్రతి నెలా 1, 4, 10, 19, 22, 28, 31 ఈ తేదులు బాగుంటాయి. ఈ తేదులలో వీరు తలపెట్టే పనులలో వీరికి విజయము, ఎక్కువ ధనా దాయము, గొప్పవారి సంప్రతింపులు ఈలాంటి మంచి ఫలితాలన్నీ ఏర్పడుతాయి.

## ప్రతికూలమైన తేదులు

ప్రతి నెలా 8, 17, 26 ఈ తేదులు వీరికి ప్రతికూలంగా ఉంటాయి. అంచేత, క్రొత్త ప్రయత్నాలేవీ ఈ రోజులలో చేయ

కుండడం మంచిది. పెద్దల్ని కలుసుకోవడం ఈ తేదులలో మానుకోవాలి.

(ఒకటి సంఖ్యవారికి 8 సంఖ్య విరుద్ధమైనది. పైచెప్పిన మూడు తేదులూ 8 సంఖ్య గలవనే విషయం స్పష్టం.)

గ్రహప్రీతి

ఒకటి సంఖ్యవారు సూర్య దేవతా ప్రీతికరంగా ఆదివార వ్రతము, ఆదిత్యహృదయ స్తోత్ర పారాయణము చేస్తుంటే మంచి ఆరోగ్యము, ప్రయత్న కార్యసిద్ధి కలుగుతాయి.

---



# రెండు సంఖ్య

సంఖ్యల వరుసలో ఒకటవ సంఖ్యకు తరువాత వచ్చేది రెండవ సంఖ్య. ఇది జంట సంఖ్యలలో మొదటిది. అంచేత ఒకటిలాగానే రెండవ సంఖ్య కూడా సంఖ్యలన్నింటిలో ప్రాధాన్యం వహించేటిది.

రెండు అనే సంఖ్యగల వస్తువుల్ని జంట అంటారు. జంటలు అనేకం ఉన్నాయి. జీవాత్మ - పరమాత్మ, సుఖము - దుఃఖము, శీతము - ఉష్ణము, పగలు - రాత్రి - ఈ విధంగా పరస్పరం ఆశ్రయిస్తూ ఉన్న అనేక పదార్థాలు, అనగా జంటలు ఈ రెండు సంఖ్యలో ఉన్నాయి.

## 2 - సంఖ్య వారు ఎవరు ?

జనవరి మొదలు డిసెంబరు వరకుగల ఇంగ్లీషు నెలలు పంన్రెండు నెలల్లో ఏ నెలలోనైనా సరే — 2, 11, 20, 29 ఈ తేదులు దేనిలోనైనా ఒక దానిలో పుట్టినవారు 2 సంఖ్య వారని గుర్తించాలి.

2-వ తేదీ పుట్టినవారు 2 సంఖ్య వారనేది స్పష్టంగానే తెలుస్తున్నది.

11-వ తేదీలో ఉన్న రెండు ఒకట్లను 1+1=అని కూడితే 2 సంఖ్య వస్తుంది.

20-వ తేదీలో సున్న తీసివేస్తే 2 సంఖ్యే మిగులుతుంది.

29-వ తేదీని 2+9=11=1+1= అని కూడితే ఆఖరున వచ్చే సంఖ్య 2 మాత్రమే.

పై విధంగా 2, 11, 20, 29 తేదులలో పుట్టిన వారిని 2-సంఖ్య వారుగా గుర్తించాలి.

## 2-సంఖ్యకు చెందిన గ్రహము

సూర్యాది నవగ్రహాలలో చంద్రుడు 2 సంఖ్యకు చెందిన వాడు. సూర్యుని తరువాత రెండవవాడుగా జ్యోతిశ్శాస్త్రంలోనూ, ఇతర శాస్త్రాలలోను పరిగణించినందువల్ల చంద్రుడు 2 సంఖ్యకు చెందినవాడనటం సమంజసమే. సూర్యుడు ఆత్మకారకుడైతే చంద్రుడు మనఃకారకుడు.

అంచేత చంద్రగ్రహానికి జ్యోతిశ్శాస్త్రంలో వివరించి ఉన్న స్వరూప స్వభావాలు, గుణగణాలు ఇవన్నీ 2 సంఖ్య వారిలో చూడవచ్చు.

## 2 సంఖ్య వారి ఆకారము

వీరిలో ఎక్కువమంది మంచి ఆకారపుష్టితో ఆకర్షకమైన రూపంతో ఉంటారు. పుష్టికి తగిన ఎత్తుకూడా ఉంటుంది. చిన్న చెవులు, గుండ్రని అందమైన కళ్లు, దళసరియైన పెదవులు,



మెత్తని వెండ్రుకలు, ముందుకు వచ్చిన కడుపు ఇవన్నీ 2-సంఖ్య వారని మనకు తెలిపే చిహ్నాలు.

## గుణగణాలు

స్వభావంలో, 2 సంఖ్య వారు చంచలమైన మనస్సు కలవారు. అదీగాక సందేహ మనస్కులు కూడాను. అంచేత ఏ పని చేసినా ముందు ఆలోచించుకొని నిదానంగా విజయవంతంగా కొనసాగించే పద్ధతి వీరికి ఉండదు. ప్రతివిషయంలోనూ తొందరపడి పూనుకోవడం, మళ్ళీ దాన్ని మానుకోవడంగా ఉంటుంది. స్వయంగా నిర్ణయించి చేసే నిదాన బుద్ధి లేకపోయినా ఇతరుల మాటకైనా విలువ యిస్తే వారు సూచించే పద్ధతులలో తమ పని సాధించుకోవచ్చు. కాని పరాయివారిని నమ్మీ నమ్మని చిత్తవృత్తితో కనిపిస్తూంటారు.

తమ వ్యవహారాలు అటుంచి, ఇతరులకి తమ వల్లనే ఏదైనా సహాయం చేయటానికి వీలుంటుందా అనే ప్రయత్నంలోనే వీరు ఉంటారు. ప్రాపంచిక చింతకన్నా వీరికి ఆధ్యాత్మిక పిపాస ఎక్కువగా ఉంటుంది. ఆధ్యాత్మిక చర్చలు చేయడమంటే, ఎంత కాలం గడిచిందీ వీరికి తెలియదు. తమ సమస్యలు గురించి పలువురి మధ్య పెట్టకుండా, ఏకాంతంలో స్వయమే చింతించి ఒకింత వాటికి సదుపాయాలు వెతుక్కునే అలవాటు కలవారు.

ప్రకృతి సౌందర్యాన్ని రసించటంలోనూ, నీటిలో ఈత కొట్టడమంటేనూ వీరికి అమిత ఆనందము. వీరికి సహజంగా ఉన్న ముక్కోపము, తొందరపాటూ కొన్ని సమయాలలో వీరి కార్య సిద్ధికి విఘ్నకరంగా ఉంటాయి. జీవిత రంగంలో విసిగి వేసారిపోయిన రెండు సంఖ్యవారు కొందరికి జలగండమే శరణమౌతుంది.

స్వతంత్ర జీవితంలో వీరికి నమ్మకం లేకపోవడం వల్ల ఇతరులకి అణిగి ఉండి, సేవకవృత్తికైనా తయారై కాలం గడిపే స్వభావం వీరికి సహజంగా ఉంటుంది.

భూతాలు పిశాచాలంటే వీరికి భీతి ఎక్కువ. 2 సంఖ్య గల ఆడవారు మరింత పిరికిపందలుగా ఉంటారు. కొంచెం కదిలించినా బెదిరించినా అమితంగా గాబరా పడిపోయేవారు. అంచేత ఈలాటివారితో, మెలకువగా వ్యవహరించాలి.

ఆకుపచ్చ వర్ణంగల వస్తువుల్నీ, వస్త్రాలనూ కొని ఉపయోగించడమంటే వీరికి ప్రీతి ఎక్కువ. ఎల్లప్పుడు తమ్ము అలంకరించుకోవడంలో ఎక్కువ కాలాన్ని వినియోగిస్తూంటారు.

## దాంపత్య జీవితం

వీరికి దాంపత్య జీవితం ఆనందంగానే ఉంటుంది. వీరు జన్మించిన తేది సమిష్టి సంఖ్య కూడా 2 గా ఉండి, 3, 5, 8 సమిష్టి సంఖ్య వారిని పెండ్లి చేసుకొంటే మరింత ఆనందకరమైన దాంపత్య జీవితంగా ఉంటుంది. అదీగాక, వీరు 25-30 ఏండ్ల వయసు మధ్యలో పెండ్లి చేసుకొంటే మంచిది. ప్రేమ వ్యవహారంలో వీరికి నూటికి నూరుపాళ్ళు విజయమే లభిస్తుంది.

## ఆర్థిక పరిస్థితి

శుక్లపక్షము, కృష్ణపక్షము అని చంద్రుడికి ఉండేలాగ వీరి ఆర్థికపరిస్థితులు ఒక సమయంలో పెరగడం మరో సమయంలో తరగడం ఈ విధంగా జీవితమంతా హెచ్చు తగ్గులుతోనే గడుస్తుంటుంది. మొత్తం మీద వీరు చేస్తూన్న వృత్తి వ్యాపారాలు వీరికి లాభదాయకంగానే ఉంటాయి.



## ఆరోగ్యము

2 సంఖ్య వారిని కడుపుకు సంబంధించిన అజీర్ణంవంటి వ్యాధులే అప్పుడప్పుడు ఎక్కువగా బాధిస్తుంటాయి. కొందరికి స్త్రీ మూలకమైన రోగాలు కలుగవచ్చు. హృదయానికి సంబంధించిన మనోవ్యాధులు కొందరిని ఎక్కువగా బాధించవచ్చు. అంచేత దుఃఖకరమైన వర్తమానాలను వీరికి చెప్పకుండడమే మంచిది. చంద్ర గ్రహం శీతల స్వభావం కలదవటం వల్ల శీతల వ్యాధులు వీరికి ఎక్కువగా వస్తుంటాయి. గ్రహ దౌర్బల్యం కలవారైన కొందరికి జలగండం వచ్చే అవకాశం ఉంటుంది. వీరి అరిచేతిలో చంద్ర స్థానంలో వలయ చిహ్నం ఉంటే నీటి మూలకమైన మరణం తప్పదు. కనుక, ఇట్టివారు నీటివద్ద హెచ్చరికతో ఉండడం బాగు.

## వృత్తి వ్యాపారాలు

ఈ 2 సంఖ్య వారిలో ఎక్కువ మంది వ్యాపార జీవనమే గడుపుతుంటారు. వ్యాపారంలో ఇతరుల పొత్తు వీరికి పనికిరాదు. అంచేత స్వతంత్రంగా వ్యాపారం చేయటమే వీరికి లాభదాయకంగా ఉంటుంది. గొప్ప గొప్ప వ్యాపారస్థులు ఈ సంఖ్యకు చెందిన వారుగా ఉంటారు. గుడ్డల మిల్లులు, ఇతర కర్మాగారాలు పెట్టుకొంటూ క్రొత్త క్రొత్త విలాస వస్తువుల్ని తయారు చేసే వారు కూడా ఉన్నారు.

ఉద్యోగంలో కొందరు ప్రభుత్వోద్యోగులుగా ఉన్నత పదవుల్ని అలంకరిస్తారు. అందుకు తగిన జీత భత్యాలు, సేవకులు మొదలైన హంగామాలతో రాణిస్తుంటారు.

చక్కని కవితలు గేయాలు రచించే వారునూ, హరికథలూ, ప్రసంగాలూ చేసే వారును కొందరు ఈ 2 సంఖ్య వారుంటారు.

చంద్రబలం లేని ఈ సంఖ్యవారు కొందరు ఇంటిపనులు చేసే సేవకులుగా, ఓడలు నావలలో పనిచేసే వారుగా, మిడ్ వయిఫ్‌లుగా, నర్సులుగా పని చేస్తుంటారు.

ఇవన్నీ లేకుండా ప్రపంచాన్ని చుట్టిరావాలనే కుతూహలం కలవారు కూడా ఈ 2 సంఖ్యకు చెందినవారే.

## చంద్రుని కాలము

ఆంగ్ల మాన రీత్యా జూన్ నెల 21-వ తేది మొదలు జూలై నెల 22వ తేదీ వరకు చంద్రుడికి సంబంధించిన కాలము. తరచు 2 - సంఖ్యవారు ఈ తేదీల మధ్య జనించిన వారై ఉండ వచ్చు. సోమవారము చంద్రునికి చెందిన వారము. కాల పరిమితిలో సుమారు ఒక గంట కాలము చంద్రుడిది. రాత్రిపూట బలం కలవాడు చంద్రుడు. ఈ అంశాలను 2 సంఖ్య వారితో అన్వయించుకోవాలి.

## చంద్రుని దేశము

చంద్రునిది ఉత్తరపు దిక్కు. చెరువులు, గుంటలు, బావులు, స్నానగది ఇంకా ఇతర చలవ ప్రదేశాలు చంద్రునికి చెందినవి. 2 సంఖ్య వారు ఉత్తర దిక్కు ముఖంగా ప్రయాణాలు చేసిననూ ఏ పనినైనా మొదలు పెట్టినను, కార్యాలయాలలో ఉత్తర ముఖంగా కూర్చున్ననూ కార్యసిద్ధి కలుగుతుంది.

## చంద్రుని రత్నము

చంద్రునికి సంబంధించిన రత్నము ముత్యము. అంచేత, చక్కగా పరీక్షించిన ముత్యాన్ని ఉంగరంలో కానీ, మెడ



గొలుసులోగాని పొదిగించి ధరిస్తే ఈ సంఖ్య వారికి గ్రహ బాధలు, శత్రుబాధలు, ఋణబాధలు ఇవన్నీ తొలగిపోతాయి. వీరు చేస్తున్న వృత్తివ్యాపారాలలో విజయాన్నిస్తుంది. చంద్రునికి సంబంధించిన లోహము వెండి.

## చంద్రుని వర్ణము

తెలుపు వర్ణము చంద్రునికి చెందినది. ఆకుపచ్చ కూడా అతనికి చెందినదే అని అనుభవం మీద విమర్శకులు నిర్ణయించారు.

## అనుకూలమైన తేదులు

2 సంఖ్య వారికి ప్రతి ఇంగ్లీషు నెలలోనూ 2, 7, 11, 16, 20, 25, 29 ఈ తేదులు అన్ని పనులకూ అనుకూలంగా ఉంటాయి. ఈ తేదులలో వీరు మొదలుపెట్టే పనులు బాగా కొనసాగుతాయి. గొప్ప వారితో సంప్రదింపులు, మంచి ధనాదాయమూ ఈ తేదులలో లభించే అవకాశం ఉంటుంది.

## ప్రతికూలమైన తేదులు

4, 8, 9, 18, 27 ఈ తేదులు చాలా ప్రతికూలంగా ఉంటాయి. తతిమ్మావి ప్రయత్నం మీద ఫలితాన్నిస్తాయి. అంచేత పై తేదులలో ఏదైన కొత్తగా మొదలుపెడితే ఫలితం ఉండదు.

## గ్రహప్రీతి

సోమవార వ్రతము, దుర్గాపూజ, దుర్గాస్తోత్రపారాయణము ఇవి చేస్తుంటే చంద్రగ్రహ ప్రీతి కలుగుతుంది.

# 3

# మూడు సంఖ్య

మూడు అనే సంఖ్య ప్రపంచ వ్యవహారంలో చాలా ముఖ్యత్వం కలది. ప్రపంచ కారణభూతంగా ఉన్న తత్వాలు, త్రిమూర్తులు ఇవన్నీ ఈ మూడు సంఖ్యలోనే అణిగాయి. బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులు, సత్త్వ - రజస్ - తమోగుణాలు, సృష్టి - స్థితి ప్రళయాలు, భూత - భవిష్యద్ - వర్తమానాలు ఈ విధంగా ఇంకా ఎన్నో అంశాలు ఈ మూడు సంఖ్యలో ఉన్నాయి.

## 3 – సంఖ్యావారు ఎవరు ?

జనవరి మొదలు డిసెంబరు వరకున్న ఇంగ్లీషు నెలలు పండ్రెండులోనూ ఏ నెలలో నైనా సరే — 3, 12, 21, 30 ఈ తేదులు దేనిలో నైనా ఒక దానిలో జన్మించినవారు 3 సంఖ్య వారని గుర్తించాలి.

3 - వ తేదీన పుట్టినవారు 3 సంఖ్యావారనేది స్పష్టంగానే తెలుస్తున్నది.

12 - వ తేదీని 1 + 2 అని కూడితే 3 వస్తుంది.



21 - వ తేదీని 2 + 1 అని కూడితే 3 వస్తుంది.

30 - వ తేదీలో సున్న తీసేస్తే మిగిలేది 3 మాత్రమే.

అంచేత, పైచెప్పిన 3, 12, 21, 30 ఈ తేదులలో పుట్టిన వారిని 3 సంఖ్య వారని నిర్ణయించి వారి ఫలితాలను క్రింది విధంగ చూచుకోవాలి.

## 3 - సంఖ్యకు చెందిన గ్రహము

3 - సంఖ్యకు చెందిన గ్రహము బృహస్పతి. వీరిని గురువు అని కూడా అంటారు. మనదేశపు సంఖ్యాశాస్త్రజ్ఞులు కొందరు 3 సంఖ్యకు కుజుడు గ్రహమని తెలిపియున్నారు. కాని పాశ్చాత్య దేశపు శాస్త్రజ్ఞులు పలువురు 3 సంఖ్యావారిలో బృహస్పతికి సంబంధించిన గుణగణాలూ తతిమ్మా అంశాలూ స్పష్టంగా కనిపిస్తుండబట్టి 3 సంఖ్యకు గురువే గ్రహమని నిర్ణయించినందున ఆ గురు గ్రహానికి చెందిన అంశాలనే ఈ క్రింద ఉదహరిస్తున్నాం.

## 3 - సంఖ్యావారి ఆకారము

3 సంఖ్యావారు మామూలు ఎత్తుగా ఉంటారు. గంభీరంగా కనిపిస్తారు. గుండ్రముగా ఎత్తుగా ఉన్న నొసటలు కలవారు. బహుశః పిల్లికండ్లువలె పచ్చని కనుపాపలు కలవారు. వీరి చూపులలోనే వీరికున్న ప్రజ్ఞ కనిపిస్తుంది. వీరికి ఎక్కువగా తలవెండ్రుకలుండవు. ఉన్న వెండ్రుకలు కూడా పిడికెడంత ఉంటూ బూడిద రంగుగా ఉంటాయి. విశాలమైన వక్షః స్థలము ఆకర్షకమైన శరీరసౌందర్యమూ కలవారు వీరు.

## గుణగణాలు

గురువును గ్రహంగా కలిగిన 3 సంఖ్య వారిలో స్వతంత్ర

మనోభావాలు ఎక్కువగా ఉంటాయి. ఇతరులకి అధీనంగా ఉండటం గాని, పరాయివారి అభిప్రాయాలను అనుసరించడం గానీ వీరికి పట్టదు. పాలిటిక్సుకంటే పారమార్థిక మంటేనే వీరికి నచ్చుతుంది. ఎక్కువ బుద్ధిసామర్థ్యాలు కలవారవటంవల్ల పరిశ్రమవల్ల క్రొత్త క్రొత్త వాటిని కనిపెట్టే ప్రవృత్తిలోనే ఉంటారు. మాటలలో చాకచక్యం కలవారవటంచేత అందరినీ ఆకర్షించే వ్యక్తిత్వం కలవారుగా రాణిస్తారు.

ఈ సంఖ్య వారిలో సత్ప్రవర్తన, సదాచారము, ఆధ్యాత్మిక చింతన ఇవన్నీ మెండుగా ఉంటాయి. ఆత్మగౌరవము, కరుణ, సహానుభూతి ఇవన్నీ వీరి మాటలలో వ్యక్తమౌతాయి.

నీతి నియమాలకు, కాల నియమాలకు బద్ధులై ఉండాలని తలంచే ఖచ్చితమైన మనుష్యులు వీరు.

వీరికి అంతగా శ్రమలూ కష్టాలూ రావు. అట్లు వచ్చినా అవి చాలా రోజులు ఆగవు. వచ్చిన సుఖ దుఃఖాలను సయితం సమంగా సహనంతో ఎదుర్కొనే వారు వీరు.

ధర్మకార్యాలంటేను, ధార్మిక సంస్థల నిర్వహణమంటేను వీరికి ఎక్కువ ఆశ. అందుమూలాన కొన్ని ధర్మసంస్థలకు వీరిలో కొందరు ట్రస్టీలుగా ఉండవలసిన పరిస్థితి కూడా ఏర్పడుతుంది.

పరస్పరం వ్యవహారం చేస్తున్నవారు కొందరు తగాయిదాలు తీర్చటానికి వీరిని మధ్యస్థంగా కోరుతారు. సత్కథా కాలక్షేపాలకు, హరికథా ప్రసంగాదులకు వెళ్ళడమంటే వీరిలో చాలమంది ఎక్కువ ప్రవృత్తి కలిగి ఉంటారు.

వీరిలో కొందరు వాసి కెక్కిన రచయితలుగా గాని, కళా రసికులుగా గాని రాణిస్తుంటారు.



## దాంపత్య జీవితము

ప్రేమ వ్యవహారంలో వీరికి పూర్తిగా విజయం ఉండదు. కొన్ని సమయాలలో విజయము, కొన్ని సందర్భాలలో అపజయమూ ఉంటాయి. వీరికి భార్యగా వచ్చు వడుచు మంచి రూపవతిగాను, సదాచారము సత్ప్రవర్తన కలదిగాను ఉంటుంది. అనుకూలమైన దాంపత్య మనాలి. 6, 8, 9 సంఖ్యగల వరుణ్ణి, లేదా వధువును పెండ్లాడితే ఈ సంఖ్యగల వారికి దాంపత్య సుఖం పూర్తిగా ఉంటుందని గ్రహించాలి.

## ఆర్థిక పరిస్థితి

వీరికి ఆర్థిక పరిస్థితి చాలా తృప్తికరంగా ఉంటుంది. వీరిలో పెక్కుమంది గర్భ శ్రీమంతులుగా పుట్టడంవల్ల బాల్యాదారభ్య యావజ్జీవితమూ ఎట్టి కొఱతగానీ లేకుండా, ఆర్థికమైన ఇబ్బందులు లేకుండా జీవితం గడుపుతుంటారు. తమది పరాయివారిది అనే భేదం లేకుండా వీరి చేతిలో ఎప్పుడూ డబ్బు చెలామణి ఔతూఉంటుంది. పరిశ్రమించి ఆర్జించాలనే నిశ్చయం కలవారైననూ కొన్ని సమయాలలో రేసులు లాటరీలు మొదలైన వాటిలో పాలొని వాటి మూలకంగా కూడా వీరికి ఆదాయం ఉంటుంది.

## ఆరోగ్యము

శరీరములోని రక్తము జీర్ణకోశములు ఇవన్నీ బృహస్పతికి చెందిన భాగాలు. వీరికి వచ్చే రోగాలు కామల, నరముల దౌర్బల్యం, మోకాళ్ల వాతము వంటివి. చల్లని వాతావరణము వీరికి పనికిరాదు. సకాలభోజనము, దేహాభ్యాసము చేస్తుంటే ఆరోగ్యాన్ని

రక్షించుకోవచ్చు. చర్మరోగాలతో బాధలు పడుతున్నవారు కొందరు ఈ 3 సంఖ్య వారిలో ఉంటారు.

## వృత్తి వ్యాపారాలు

ముఖ్యంగా 3 సంఖ్యవారు జడ్జీలు, లాయర్లు మొదలైన న్యాయ వృత్తులు చేసేవారుగాను, బ్యాంకీలలో పనిచేసే వారుగా గాను ఉంటారు. కొందరు సత్కథా ప్రవచనాలు సలిపే వారుగా జీవిక పెట్టుతుంటారు. ధార్మిక సంస్థలలో పనిచేసేవారు కూడా ఈ సంఖ్యవారే.

ప్రభుత్వోద్యోగస్థులుగా కొందరుంటారు. అలాటివారు తమ కర్తవ్యాలను చక్కగా నెరవేర్చే వారుగా రాణిస్తారు.

వీరిలో కొందరు వ్యాపారస్థులు కూడా ఉంటారు.

జ్యోతిష మనే విద్యకు ప్రధానుడు గురువు. అందుచేత ప్రత్యక్షంగాగానీ పరోక్షంగాగానీ వీరికి జ్యోతిష విద్యతో సంబంధం ఉంటుంది. వీరిలో కొందరు జ్యోతిష్కులుగా జీవితం గడుపుతుంటారు.

## బృహస్పతికి చెందిన కాలము

నవంబరు నెల 22-వ తేది మొదలుకొని డిశంబరు 21-వ తేదివరకైన కాలము బృహస్పతికి చెందినది. మరియు ఫిబ్రవరి 19-వ తేది మొదలు మార్చి 20-వ తేది వరకున్న కాలము కూడా ఇతనికి చెందినదే. పగలు, రాత్రి సర్వకాలములూ బృహస్పతికి బలమైనవే. ఒక నెలకాలము ఇతనికై ఏర్పడిన కాలపరిమితి. గురువారము గురువుకు చెందినది. అందుచేత ఈ కాలాలలో చేసే పనులు బాగా నెరవేరుతాయి.



## బృహస్పతికి చెందిన దేశము

బృహస్పతికి చెందిన దిక్కు ఈశాన్యము. దేవాలయములు, ప్రార్థనాస్థలములు, న్యాయస్థానములు, జ్ఞానపీఠాలు మొదలైనవి బృహస్పతికి చెందిన ప్రదేశాలు.

## అదృష్ట రత్నము

బృహస్పతికి చెందిన రత్నము పుష్యరాగము. అందేత పుష్యరాగపు రాళ్ళు పొదిగిన ఉంగరము, అంటుజోళ్ళు, మెడ గొలుసు, గడియారపు గొలుసు మొదలగు వాటిని శరీరములో ధరిస్తే ఈ సంఖ్యవారికి సర్వతోముఖమైన విజయం చేకూరుతుంది. వసతిలేనివారు ఒట్టి బంగారంతో మాత్రం చేసిన వస్తువుల్ని ధరించిననూ ఫలితం ఉంటుంది.

## అదృష్ట వర్ణము

3 సంఖ్యకు చెందిన వర్ణము ఊదా వర్ణము. అంచేత ఊదా వర్ణముకల వస్త్రములను, లేదా ఆ రంగుతో అంచుగల వస్త్రాలను ధరిస్తే లాభదాయకంగా ఉంటుంది.

## అనుకూలమైన తేదులు

ఏ నెలలోనైననూ సరే, 2, 3, 7, 9, 11, 12, 18, 20, 21, 25, 27, 29, 30 ఈ తేదులు చాలా అనుకూలంగా ఉంటాయి. అంచేత ఈ తేదులలో మొదలు పెట్టే పనులు సిద్ధిస్తాయి. ఈ తేదులలో చేసే ఆర్థిక ప్రయత్నాలు ఫలిస్తాయి. ఎదురు చూడకుండా ధనాదాయం కూడా ఈ రోజులలో ఉంటుంది.

### ప్రతికూలమైన తేదులు

6, 15, 24 తేదులు ప్రతికూలమైన తేదులు. అంచేత ఏ క్రొత్తపనీ ఈ తేదులలో మొదలు పెట్టకుండా ఉండాలి. పెద్ద వారిని కలుసుకోవడం కూడా ఈ రోజులలో మానుకోవాలి.

### గ్రహ ప్రతి

శ్రీ రామాయణ పారాయణము, దక్షిణామూర్తి స్తోత్ర పఠనము ఇవి చేస్తుంటే గ్రహప్రీతి కలుగుతుంది.

---

# 4

# నాలుగు సంఖ్య

నాలుగు సంఖ్య తతిమ్మా సంఖ్యలు లాగానే ప్రత్యేకత వహిస్తుంది. నాలుగులోని అంశాలు అనేకం ఉన్నాయి. నాలుగు దిక్కులు, నాలుసు వేదాలు, నాలుగు భుజములు, సామ-దాన-భేద-దండములనే నాలుగు ఉపాయాలు, ధర్మ-అర్థ-కామ-మోక్షములనే నాల్గు పురుషార్థాలు, బాల్య-కౌమార-యౌవన వార్ధక మనే అవస్థలూ, ఇంకా ఎన్నెన్నో అంశాలు ఈ నాలుగులో ఉన్నాయి. అంచేత నాలుగు సంఖ్యవారిలో ప్రత్యేకత ఉంటుంది.

### 4-సంఖ్యవారు ఎవరు?

ఏ నెలలోనైనా సరే, 4, 13, 22, 31 ఈ తేదులు ఒకదానిలో జన్మించిన వారైతే వారు 4 సంఖ్యవారు.

4 వ తేది 4 సంఖ్య కలదవటం స్పష్టంగానే తెలుస్తున్నది.

3 వ తేదీలోని సంఖ్యలను 1 + 3 అని కూడితే 4 వస్తుంది.

అలాగే 22-వ తేదీలోని సంఖ్యల్ని 2+2 అని కూడితే నాలుగే వస్తున్నది.

అదే విధంగా 31- తేదీలోని సంఖ్యల్ని 3 + 1 అని కూడితే వచ్చేది 4 సంఖ్యే ఔతుంది.

అంచేత 4, 13, 22, 31 ఈ తేదులలో జన్మించినవారు ఎవరైనా సరే, వారు 4 సంఖ్యకు చెందినవారని గుర్తుపెట్టి ఆ సంఖ్యకు నిర్ణయించిన ఫలితాలను చూచుకోవాలి.

## 4 – సంఖ్యకు చెందిన గ్రహము

నాలుగు సంఖ్యకు చెందిన గ్రహం రాహువని మన దేశపు సంఖ్యా శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. రాహు కేతువులు ఛాయా గ్రహాలనీ వాటికి మానవ జీవితంపై ఆకర్షణ లేదనీ చెప్పే వాదం కూడా ఉన్నది. అంచేతనో ఏమో పాశ్చాత్య శాస్త్రవేత్తలు 4, 7 ఈ రెండు సంఖ్యలకూ వరుసగా యురనస్. నెప్ట్యూన్ అనే గ్రహాలు సంబంధం కలవని చెప్పారు. కాని భారతీయ శాస్త్రజ్ఞుల రీత్యా 4 సంఖ్యకు రాహువే కారకుడని నిర్ణయించుకొని ఫలితాన్ని తెలుసుకొందాం.

## 4 - సంఖ్యవారి ఆకారం

మధ్యరకమైన ఎత్తుగా విశాలమైన భుజాలు, సన్నగా నల్లగా ఉన్న నేత్రాలు, పెద్ద చెవులు కలవారుగా ఉంటారు. నల్లగానో, చామన చాయగానో ఉంటారు వీరు. వీరికి కాళ్లుకూడా శరీరానికి తగినట్లుగా లేకుండా పొట్టిగా ఉంటాయి. విచిత్రమైన శరీరం కలవారవటంచేత అందరినీ తనవైపు ఆకర్షించే ఆకారము వీరికి ఉంటుందనాలి.

## గుణగణాలు

ఈ నాలుగు సంఖ్యవారిని చూస్తూనే కనిపెట్టవచ్చు. వీరు



స్వభావంలో చాలా అణుకువతో ఉంటారు. పెద్దలంటే పై అధికారులంటే వీరు చాలా వినయం చూపెడతారు. అంత మా తమేకాదు; కుటుంబంలోనివారు అందరితోను ప్రేమగా వర్తించే స్వభావం కలవారు వీరు. వీరి నడవడివల్ల, మాటలవల్ల అందరినీ స్నేహితులుగా చేసుకొనే ఆకర్షణ వీరికి స్వభావ సిద్ధంగా ఉంటుంది.

దేనినీ వెంటనే నమ్మి ప్రవర్తించేవారు కారు వీరు. ప్రతిదీ వీరికి సందేహంగానే కనిపిస్తుంది. ఐనా, అందుకని వీరు అన్నిం ట్లోనూ వెనుకాడే స్వభావం కలవారు కాదు.

అస్పష్టానికంటే ప్రయత్నం వల్లనే పురోగమించాలనే స్వతంత్ర ప్రవృత్తి కలవారు వీరు. నీతి నియమాలకు, జాతి నియమాలకు కట్టుపడి ఉండాలనే సదుద్దేశ్యం కలిగి ఉంటారు. వీరిలో ఉన్న భక్తి పటాటోపంగా ఉండదు. సదా దైవ విశ్వా సంతో ప్రవర్తిస్తుంటారు.

ఆత్మగౌరవాన్ని రక్షించుకొనే ప్రవృత్తి వీరిలో ఎక్కువగా ఉంటుంది. ఎక్కువ పటాటోపము లేకుండా సాధారణమైన దుస్తుల్ని ధరించేవారు వీరు.

## దాంపత్య జీవితం

ఈ నాలుగు సంఖ్యవారికి పిన్న వయసులోనే పెండ్లి జరుగుతుంది. అంచేత కుటుంబాన్ని నిర్వహించే బాధ్యత అప్పటి నుంచే వీరికి సంక్రమిస్తుంది. భార్యా భర్తల మధ్య ప్రేమ బంధ స్వాభావికంగా కనిపిస్తుంటుంది. అప్పుడప్పుడు వీరి మధ్య లే అభిప్రాయ భేదాలు అప్పటికప్పుడే అణిగిపోతాయి.

## ఆర్థిక పరిస్థితి

నాలుగ సంఖ్యవారిలో పలువురు ధనవంతులుగా ఉంటారు. పిత్రార్జితానికంటే స్వార్జితం ఉండాలనే ప్రయత్నంలో వీరు వుండినా, చేతులూ మనసూ ధారాళంగా ఉండబట్టి అంతగా కూడబెట్టే అవకాశం వీరికి చిక్కదు. కాని, వీరు పెడుతున్న ఖర్చులు దుబారాగా కాకుండా పరాయివారికి ఉపకారంగా ఉండి పోతాయి.

## ఆరోగ్యము

ఈ నాలుగు సంఖ్య వారిలో పైత్యప్రకోపం ఎక్కువగా ఉంటుంది. అంచేత పైత్యంచేసే వస్తువుల్ని వీరు వాడకుండా ఉండడం ఎంతైనా మంచిది. మెదడుకు సంబంధించిన రోగాలు, అనీమియా అనే రోగము, కామల వంటివి వీరికి వచ్చే రోగాలుగా ఉంటాయి.

## వృత్తి వ్యాపారాలు

వీరిలో కొందరు తప్ప, తతిమ్మావారు ఇతరులకు అధీనంగా సేవక వృత్తిలోని వారుగా ఉంటారు. తాము చేస్తున్న వృత్తిలో అందరికీ ప్రీతికరంగా నిజాయితీతో వర్తిస్తారు. రాజకీయంలో పాల్గొనేవారుగా, వక్కీళ్ళుగా, ఇంకా ఇరువురి మధ్య నిలిచి సొత్తులూ సొమ్ములూ అమ్మించి కమీషను తీసుకొనే బ్రోకర్లుగా కూడా కొందరుంటారు. హాస్టళ్ళు, హోటళ్ళు నడిపేవారు కూడా కొందరు ఈ సంఖ్యల వారుంటారు. ఆల్కహాల్ వంటివి కలిపిన మందులు, అరిష్టాలు అమ్ముకొనేవారు కూడ కొందరుంటారు.

## రాహువుకు చెందిన కాలము

ప్రత్యేకంగా రాహువుకని ఒక వారము లేదు. కాని, శని



లాగా రాహువునకు ఫలితం చెప్పాలని జ్యోతిషశాస్త్రం చెప్పడం వల్ల శనివారాన్ని రాహువుకు చెందిన [illegible]గా నిర్ణయించాలి. ఇంకొక ముఖ్యమైన సంగతి. రోజూ రాహుకాలమని 1½ గంటలు వానికి కేటాయించి ఉన్నారు. ఆ కాలంలో చేసే పనులు సిద్ధించవని కూడా చెబుతారు. 1½ సంవత్సర కాలము రాహువునకు చెందినది.

## రాహువుకు చెందిన దేశము

దక్షిణ దిక్కు రాహువుకు చెందినది. ఎడారి ప్రదేశములు, గుహలు, స్మశాన వాటికలు, పుట్టలు, భూగర్భములు, పెంకుటిళ్ళు, పాడుపడిన భవనములు, శుష్క క్షేత్రములు వంటివి రాహువుకు చెందిన ప్రదేశములు. వీటినిబట్టి [illegible] సంఖ్యవారి సంచారము, నివాసము మొదలగువాటిని ఊహించుకోవాలి.

## అదృష్ట రత్నము

4 సంఖ్యవారు గోమేధకం అనే రత్నాన్ని, లేదా పసుపు పచ్చగా ఉన్న వజ్రరత్నాన్ని ఉంగరంలోకానీ, మెడగొలుసులో కాని, లేదా గడియారం చెయిను మొదలైన వాటిలో కాని పొదిగించి ధరిస్తే జీవితరంగంలో అన్నివైపులా విజయమే సిద్ధిస్తుంది. అదీగాక, వీరికి వచ్చే రోగాలనుండి వీరిని రక్షిస్తుంది.

## అదృష్ట వర్ణము

బూడిద వర్ణము, లేదా పలచని పసుపుపచ్చ వర్ణము ఈ 4 సంఖ్య వారికి చెందినది. సర్ప శరీరంలాగా మెరుస్తున్న రంగు కూడా ఈ సంఖ్యకు చెందినదే. అంచేత 4 సంఖ్యవారు

పైచెప్పిన రంగులుగల వస్త్రాలనూ, ఆభరణాలనూ ధరిస్తే అదృష్ట దాయకంగా ఉంటుంది.

### అనుకూలమైన తేదులు

ఈ 4 సంఖ్యవారికి ఏ నెలలోనైననూ సరే — 1, 10, 19, 28 ఈ తేదులు లాభదాయకంగా ఉంటాయి. అంచేత క్రొత్త వ్యాపారాలు, ఉద్యోగ ప్రయత్నాలు, పెద్దలతో సంప్రదింపులూ ఈ తేదులలో చేస్తే అనుకూలంగా ఉంటుంది. ఈ తేదులలో అచింతితంగా ధనాదాయం కూడా ఉంటుంది.

### ప్రతికూలమైన తేదులు

పై చెప్పిన తేదులు తప్ప తతిమ్మా తేదులు అనుకూలంగా ఉండవు. అంచేత అటువంటి ప్రతికూలమైన తేదులలో ఏ పనీ మొదలుపెట్టకుండా ఉండడమే మంచిదనాలి.

### గ్రహప్రీతి

ఈ నాలుగు సంఖ్యవారు దుర్గాస్తోత్ర పారాయణము, దుర్గాదేవీ దర్శనము, గ్రామదేవతా పూజాదులు చేయుచుండిన రాహుగ్రహ ప్రీతి కలుగుతుంది.

---

# 5

## ఐదు సంఖ్య

ఐదు సంఖ్యలో కూడా తతిమ్మా అన్ని సంఖ్యలులాగానే ప్రత్యేకత లేకపోలేదు. ప్రాపంచిక పదార్థాలలో ఐదు సంఖ్యలు గలవి అనేకం ఉన్నాయి. మానవలోక సృష్టికి కారణభూతమైన నేల, నిప్పు, నీరు, గాలి, ఆకాశము అనే పంచభూతాలూ ఐదుకు చెందినవే. మానవ శరీరంలో జ్ఞానాన్ని వెలిబుచ్చే సాధనాలైన ఐదు జ్ఞానేంద్రియాలు, క్రియాకలాపాలను సాధించే పంచ కర్మేంద్రియాలూ ఐదు సంఖ్యలోకి చెందినవి. ఇలా, పంచ బాణములు, పంచామృతము, పంచలోహములు, తిథి వార నక్షత్ర యోగకరణములనే పంచాంగము ఇంకా అనేక పదార్థాలు ఈ ఐదు సంఖ్యలోకి వస్తాయి.

### 5 — సంఖ్య వారు ఎవరు ?

జనవరి మొదలు డిశంబరు వరకు ఏ నెలలోనైనా సరే 5, 14, 23 ఈ తేదులలో ఏదైనా ఒకదానిలో జన్మించినవారు 5 సంఖ్యవారని గుర్తించాలి.

5-వ తేది 5 సంఖ్యకు చెందిన విషయం స్పష్టంగా తెలుస్తుంది.

14-వ తేదీలోని రెండు సంఖ్యలను 1 + 4 అని కూడితే 5 వస్తుంది.

అలాగే, 23-వ తేదీలోని సంఖ్యలు రెంటినీ 2+3 అని కూడితే వచ్చేది 5 మాత్రమే.

అంచేత 5, 14, 23 ఈ తేదులలో పుట్టిన వారందరూ 5 సంఖ్య వారని గుర్తుంచుకొని వారికి చెప్పిన ఫలితాలను చూచుకోవాలి.

## 5 – సంఖ్యకు చెందిన గ్రహము

ఐదు సంఖ్యకు చెందిన గ్రహం బుధుడు. ఇతన్ని, జ్ఞాన కారకుడని జ్యోతిష శాస్త్రం చెబుతున్నది. అంటే, మానవునిలో జ్ఞానాంశమును (మెదడును) బుధునికి ఉన్న బలాన్ని బట్టి నిర్ణయించాలని ఆ శాస్త్రనిర్ణయం. ఇక్కడ సంఖ్యా శాస్త్రంలో, ఐదు జ్ఞానేం దియాలకు సంబంధించిన బుధుణ్ణి ఐదు సంఖ్యకు చెందిన గ్రహంగా నిర్ణయించటం యుక్తిసంగతంగానే ఉంటున్నది. అంచేత 5 సంఖ్య వారిలో బుధగ్రహానికి జ్యోతిష శాస్త్రంలో చెప్పిన ఆకారము గుణగణాలు ఇవన్నీ ఉంటాయి.

## 5-సంఖ్యావారి ఆకారము

ఐదు సంఖ్యావారు ఆకారంలో ఎత్తుగా ఉంటారు. భుజాలూ చేతులూ వీరికి పొడవుగా ఉంటాయి. ముఖము విశాలంగా లేకుండా కురచగా ఉంటుంది తీక్షణంగా చూసే నేత్రాలు, చామన



ఛాయగల శరీరవర్ణము, అతివేగంగా నడిచేకాళ్ళు, శరీరబలానికంటే బుద్ధిబలము వాక్కుబలమూ ఎక్కువగా ఉండటం, ఈ అంశాలన్నీ కలవారిని బుధగ్రహానికి చెందిన 5 సంఖ్యావారుగా గుర్తించుకోవాలి.

## గుణగణాలు

ఐదు సంఖ్యవారు తమ్ము అందరూ మెచ్చుకొనే రీతిలో వాక్చాతుర్యంతో మాట్లాడే వారుగా ఉంటారు. ఒక్కొక్క సందర్భంలో వీరు మాట్లాడేది వితండవాదంగా కనిపిస్తుంది. ఐనా, వ్యర్థంగా మాట్లాడి కాలాన్ని పోగొట్టడమనేది వీరికి నచ్చదు. ఎప్పుడూ ఏదో విధంగా జీవితంలో ముందుకు సాగుతుండాలనే తహతహలు వీరికి ఉంటాయి. జీవితంలో స్థిరతకన్నా, మార్పులూ ఉత్తరోత్తరం అభివృద్ధులూ కలవారుగా వీరు కనిపిస్తుంటారు.

కళలమీద తత్వ విచారణమీద వీరికి ఎక్కువగా ప్రవృత్తి ఉంటుంది. విజ్ఞానరంగంలో ఎక్కువ పరిశ్రమించి, దేన్నైనా క్రొత్తగా కనిపెట్టి విఖ్యాతి పొందాలనే కుతూహలం వీరికి ఎక్కువగా ఉంటుంది. ఇతరులు చేసే సహాయం మూలాన కాకుండా స్వయంగా కష్టించి ముందుకు సాగేవారు.

వస్త్రాలతో ఇతర విలాస వస్తువులతో బాగా తమ్ము అలంకరించుకోవడమంటే వీరికి ఎక్కువ ఆశ. సంఘంలో ఉండి జీవితం గడపడానికంటే ఏకాంతంలో చింతనలతో చెలిమి పెట్టుకోవడమంటే వీరికి ఎక్కువ ఇష్టం. అంచేత ఏదో ఒక సాకు పెట్టుకొని ఏకాంత స్థలానికి పారిపోతుంటారు. సోమరితనం వీరికి పనికి రాదు. ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూనో వ్రాస్తూనో ఉంటారు.

దాంపత్య జీవితము

ఐదు సంఖ్య వారి దాంపత్య జీవితం అంతగా సుఖకరంగా ఉండదు. భార్యా భర్తల మధ్య తగాదాల వల్లను పరస్పరం అతృప్తి వల్లనూ అనేక సంధర్భాలలో కుటుంబానికంటే సన్యాసమే మేలనిపిస్తుంటుంది. బయటకాని, ఏకాంత స్థలాలలోకాని ఎంతో హాయిగా కాలం గడిపే ఈ సంఖ్యవారు కొందరికి ఇంటికి వస్తూనే ఎక్కణ్ణుంచో అశాంతి, కలవరము, చింత ఇవన్నీ అవరించు కొంటాయి. మొత్తము మీద దాంపత్య జీవితాని కంటే సామాజిక, వైజ్ఞానిక జీవితాలే వీరికి తృప్తికరంగా ఉంటాయి.

ఆర్థిక పరిస్థితి

సరస్వతి ఉన్న చోట లక్ష్మి ఉండదు. అంచేత విజ్ఞాన పరిపూర్తి కలిగిన ఈ 5 సంఖ్యవారికి అంతగా ఆర్థిక సౌష్ఠవం ఉండదు. అయినా ఆదాయమంటూ లేకపోలేదు. ఉన్న ఆదాయం కూడా ఆత్మానందం కోసం వస్త్రాభరణాల కోసం ఖర్చు పెడుతారు. డబ్బు కూడపెట్టాలనే ప్రవృత్తి వీరికి ఉండదు. రేపు సంగతి రేపే. కాని, వచ్చిన అవకాశాలను బాగా వినియోగించుకొనే వారు వీరు.

ఆరోగ్యము

బుద్ధిపరిశ్రమ ఎక్కువగా కలవారవటంవల్ల వీరికి శరీర బలం తక్కువగా ఉంటుంది. నరములకు సంబంధించిన రోగాలు వీరికి ఎక్కువగా వస్తాయి. వీరిలో పలువురు గోళ్ళు కొరికే వారుగా ఉంటారు. నరములు బలం తక్కువ పడినవారే అలా చేస్తారనేది గుర్తించాలి. వాత సంబంధమైన రోగాలు కూడా కొందరికి వస్తాయి.



నాలుకలో నొప్పుల వల్ల కొందరు బాధలు పడుతుంటారు. కొన్ని సమయాలలో జ్ఞాపక శక్తి కూడా వీరికి కుంటుపడుతుంది.

వృత్తి వ్యాపారాలు

ఐదు సంఖ్య వారిలో కొందరు జ్ఞాన విజ్ఞానాలకు చెందిన వృత్తులలో ప్రసిద్ధులుగా ఉంటారు. కళాంశ పరిపూర్ణులైన నటీ నటులు కూడా ఈ సంఖ్య వారిలో కొందరుంటారు. కోర్టు కచ్చేరీలలో వాదించే సమర్థతగల లాయర్లు కూడా ఈ సంఖ్యవారే. జ్యోతిష శాస్త్రాన్ని ప్రధాన వృత్తిగా గాని సహాయ వృత్తిగా కాని పెట్టుకొన్న వారు కూడా పలువురు ఉంటారు. గణిత శాస్త్రంలో నిష్ణాతులుగా ఉన్న గణితోపాధ్యాయులు, ఆడిటర్లు మొదలైన వారు కూడా ఈ రకానికి చెందినవారే. వ్యాపార రంగంలో సమర్థులుగా నాణ్యంగా వ్యవహరించే గొప్పవ్యాపారస్థులు కూడా ఈ ఐదు సంఖ్యల వారిలో కొందరు ఉంటారు.

బుధుని కాలము

బుధవారము బుధునికి చెందిన వారము. ప్రతి సంవత్సరం మే నెల 21-వ తేదీ మొదలు జూన్ నెల 20-వ తేదీవరకును, ఆగష్టు నెల 23-తేదీ మొదలు సెప్టంబరు నెల 22-వ తేదీవరకును ఉన్న కాలము బుధునికి చెందినది. ఈ ఐదు సంఖ్యలవారు పై నెలలలో జన్మించిన వారుగా ఉండవచ్చు. రెండు నెలల కాలము బుధునికి చెందిన ఖండకాలము.

బుధుని దేశము

ఉత్తరదిక్కు బుధునికి చెందినది. కొండలు, అటస్థలాలు,

విద్యాశాలలు, లైబ్రరీలు మొదలైనవి బుధునికి చెందిన ప్రదేశాలు. ఈ సంఖ్యవారు ఉత్తర దిక్కు ముఖంగా కూర్చొనటం మంచిది.

అదృష్ట రత్నము

5 సంఖ్య వారికి (బుధగ్రహానికి) సంబంధించిన రత్నము గారుత్మతం అనే గరుడపచ్చరాళ్ళు. ఆ రత్నాన్ని ఉంగరము, మెడగొలుసు, గడియారపుచైను మొదలైన వాటిలో పొదిగించి ధరిస్తే ఈ సంఖ్యవారికి అన్ని వైపులా విజయం సిద్ధిస్తుంది.

అదృష్ట వర్ణము

అకుపచ్చ రంగు ఈ గ్రహానికి చెందినది. అందుచేత అకుపచ్చ వర్ణంగల వస్త్రాలను, ఆభరణాలను ధరించడం వీరికి ఎప్పుడూ లాభదాయకంగా ఉంటుంది.

అనుకూలమైన తేదులు

ప్రతినెల 5, 14, 23 తేదులు వీరికి అనుకూలమైన తేదులుగా ఉంటాయి. ఈ రోజులలో కార్య సిద్ధులు, అధికంగా ధనలాభము, పెద్దల దర్శనము మొదలైన మంచి ఫలితాలన్నీ ఏర్పడుతాయి.

ప్రతికూలమైన తేదులు

పై చెప్పిన తేదులు తప్ప తతిమ్మా తేదులు అనుకూలించవు. అంచేత ఏ క్రొత్త పనీ మొదలు పెట్టకుండా ఉండడమే మంచిది.

గ్రహశాంతి – గ్రహప్రీతి

శ్రీ విష్ణు సహస్రనామ పారాయణము, గాయత్రీ జపము, మహామృత్యుంజయ జపము మొదలైన వాటిని గ్రహ శాంతిగా అనుష్ఠించాలి.

# 6

# ఆరు సంఖ్య

ఒకటి మొదలు తొమ్మిది సంఖ్యలలో ఇమిడిన సంఖ్యా తత్త్వాలలో ఆరు సంఖ్యకు కూడా ప్రత్యేకత ఉన్నది. ఆరు సంఖ్యలోనివి అనేకం ఉన్నాయి. ఋతువులు ఆరు; కర్మలు ఆరు; రసములు ఆరు షణ్మతములు, షట్‌శాస్త్రములు ఇంకా ఆపలోనివి చాలా ఉన్నవి.

ఆరు సంఖ్యవారు ఎవరు?

ఇంగ్లీషు నెల దేనిలోనైనా సరే, 6, 15, 24, ఈ తేదులు ఒకదానిలో పుట్టినవారు ఆరు సంఖ్యవారు

6-వ తేది పుట్టినవారు 6 సంఖ్యవారనటంలో సందేహం లేదు.

15-వ తేదీలోని సంఖ్యలను 1 + 5 అని కూడితే 6 వస్తుంది.

అలాగే 24-వ తేదీలోని సంఖ్యలను 2 + 4 అని కూడితే 6 సంఖ్యే వస్తుంది.

అందుచేత 6, 15, 24 ఈ తేదులలోని వారిని 6 సంఖ్య వారని గుర్తించాలి. తరువాత ఈ సంఖ్యకు చెందిన గ్రహానికి చెప్పిన స్వరూప స్వభావాలను, గుణగణాలను ఇతర విషయాలనూ ఈ క్రింది రీతిగా తెలుసుకోవాలి.

## ఆరు సంఖ్యకు చెందిన గ్రహము

అరు సంఖ్యకు చెందిన గ్రహము శుక్రుడు. వారములలో ఆరవవారము శుక్రవారము. అంచేత 6 సంఖ్యకు చెందిన వాడు శుక్రడన్నది సులభంగా జ్ఞాపకం పెట్టుకోవచ్చు. అదీగాక, జ్యోతిష శాస్త్ర గ్రంథాలలో శుక్ర గ్రహానికి చెప్పినవన్నీ ఈ 6 సంఖ్య వారిలో కనిపిస్తుంటాయి.

## 6 – సంఖ్యవారి ఆకారము

అరు సంఖ్యవారు మగవారుగా ఉన్నా, ఆడవారు ఉన్నా చూడటానికి చాలా అందంగా ఉంటారు. తెల్లగానో నల్ల గానో కాకుండా చామన చాయగా ఉన్న శరీరం కలవారు. మధ్య రకమైన ఎత్తుగా ఉంటారు. నీలవర్ణముగల కండ్లు, మెలివేసిన మెత్తని వెంట్రుకలు, మధురమైన కంఠరవము ఇవన్నీ వీరు అరు సంఖ్య వారని మనకు సూచిస్తాయి.

## గుణగణాలు

అరు సంఖ్య వారిలో చాలా మంది ప్రేమ, సౌందర్యం వీటికి ఉనికిగా కనిపిస్తారు. పాదాది కేశాంతమూ సుందరులైన ఈ సంఖ్యకు చెందిన పురుషులుగాని, స్త్రీలుగాని, సదా సర్వకాలమూ తమ్ము అలంకరించుకోవడంలో ఎక్కువ కాలము వినియోగిస్తుం టారు. తమ్మును, పరిసర ప్రదేశాలనూ శుభ్రంగా, అందంగా, ఆకర్షకంగా పెట్టుకొనేవారు వీరు.



రకరకమైన దుస్తుల్ని, సుగంధ ద్రవ్యాలను ధరించడమంటే వీరికి ఎక్కువ ఆశ.

సంగీత సాహిత్యాలలో ఎక్కువ అభిరుచీ పాండిత్యమూ వీరికి ఉంటుంది. పలువురు సుప్రసిద్ధ సంగీత విదుషీ మణులూ ఈ సంఖ్యలోనివారు ఉన్నారు.

ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరులకి ఉపకారము చేసే స్వభావం వీరిది. స్వార్థం చెడిపోయినా పరార్థానికై పాట్లు పడే త్యాగమూర్తులు వీరు.

తెల్లటి వస్త్రాలు, రత్నాలు వీటి మీద వీరికి ఆశ ఎక్కువ. ఇతర రంగులంటే వీరికి నచ్చవు.

ఎక్కువ కామ ప్రవృత్తి కలవారవటంవల్ల సత్ప్రవర్తన అంతగా ప్రాధాన్యం ఉండదు. ప్రేమ వ్యవహారంలో అపజయ మన్నది వీరు ఎరుగరు. అందుకు వీరి శరీర సౌష్ఠవము, ముఖ సౌందర్యమూ ఆకర్షణ ఇవే కారణభూతాలు.

వీరు మధురంగా చక్కగా మాట్లాడుతూ ఇతరులను తమ వైపు లొంగతీసుకొనే వారుగా ఉంటారు.

## దాంపత్య జీవితం

అరు సంఖ్యవారికి మంచి రూపము, గుణగణాలు ఉన్న భార్య లేదా భర్త లభిస్తారు. అనురూపమైన వారు లభించడంవల్ల వీరి దాంపత్య జీవితం సుఖకరంగానే ఉంటుంది. ఈ సంఖ్యకు చెందిన పురుషుల ప్రేమవ్యవహారాలు బాగా విజయవంతంగా సాగుతాయి. వీరిలోని స్వతంత్ర ప్రవృత్తి ఏమాత్రం దాంపత్య జీవితంలోని ప్రశాంతతకు భంగకరంగా ఉండదు. తమలోని ఆకర్షణ తెచ్చిపెట్టే పరిస్థితులకు లొంగి పోకుండా జాగ్రత్త

వహించడం వీరికి ఎంతైనా అవసరం. వీలైనంత త్వరలో పెండ్లి చేసుకొని పవిత్రమైన జీవితాన్ని గడపడానికి వీరు యత్నించాలి.

## ఆర్థిక పరిస్థితి

ఆరు సంఖ్యవారికి ఆర్థిక పరిస్థితి చాలా మెరుగుగా ఉంటుంది. వీరు విలాసవస్తువుల కోసం, వస్త్రాభరణాల కోసం ఖర్చు పెట్టేది ఎక్కువయినా అందుకు తగిన ఆదాయం ఉండనే ఉంటుంది. ఈ సంఖ్యవారు కొందరు అగర్భ శ్రీమంతులుగా పుట్టడంవల్ల ఎంత ఖర్చయినా అది లెఖ్కలోకి రాకుండా ఉండి పోతుంది.

## ఆరోగ్యము

వీరు అంతగా ఆరోగ్యవంతులని చెప్పడానికి వీలుండదు. ఒంట్లో అలసట, నరముల బడలిక, నీరు, నిప్పు, ఆయుధాలు వీటి మూలాన గండాలూ వస్తుంటాయి. కొందరు మాటిమాటికి గొంతులో ముక్కులో చెవులలో తలలో నొప్పులతో బాధలు పడుతుంటారు. ప్రాణాపద సంభవించే సూచనలున్నా తేరు కొంటారు. గనేరియా అనే మేహవ్యాధితో బాధలు పడకుండా జాగ్రత్త పడటం ఎంతైనా అవసరమనాలి.

## వృత్తి వ్యాపారాలు

ఆరు సంఖ్యవారి వృత్తుల్ని మూడురకాలుగా విభజించ వచ్చు. నాటకాలు, సినిమాలువంటి వాటితో సంబంధం పెట్టు కొన్న నటీనటులు బహుశా ఈ సంఖ్య వారుగా ఉంటారు. అదీ గాక సినిమాలు నాటకాలలో వెనుక పాటలు పాడేవారు, ఇతర కళాకారులు కూడా ఈ రకానికి చెందినవారే. చైత్రికులు,



శిల్పులు, అలంకార వస్త్రాలు తయారు చేసేవారూ ఇంకా ఈలాంటి కళలకు సంబంధించిన వారూ ఇదే రకానికి చెందినవారే.

కొందరు చట్టములు బాగా తెలిసి కీర్తిగడించిన లాయర్లు, జడ్జీలు, సుప్రసిద్ధ డాక్టర్లు వంటివారు రెండవ రకానికి చెందిన వారు.

రత్నాలు, మధుర పదార్థాలు, ఆడువారికి పనికివచ్చే విలాసవస్తువులు, వస్త్రాలు వాటితో వ్యాపారంచేసి అందులో ఎక్కువ ఆర్జన చేసుకొన్న గొప్ప వ్యాపారస్తులు మూడవ రకానికి చెందినవారు.

## శుక్రుని కాలము

వారములో శుక్రవారము శుక్రునికి చెందినది. ఏప్రిల్ నెల 20-వ తేదీ మొదలు మే నెల 20-వ తేదీ, సెప్టెంబరు 23-వ తేదీ, మొదలు అక్టోబరు 22-వ తేదీవరకైన కాలము శుక్రునికి చెందినది. బహుశా ఆరు సంఖ్యవారు ఈ తేదుల మధ్యలో పుట్టినవారుగా ఉండాలి. అలా ఉంటే చాలా అదృష్ట వంతులనాలి.

## శుక్రుని దేశము

పడమర దిక్కును, నైరృతి దిక్కును శుక్రుని దిక్కులు. ఈ దిక్కులవైపుగా ప్రయాణాలు చేసినా, ఆఫీసులలో కూర్చొని పనిచేసినా విజయం కలుగుతుంది. పడకగది, పంటభూములు, సుందరభవనాలు మొదలైనవి ఈ శుక్రునికి చెందిన దేశాలు. వీటినిబట్టి వీరి వాసస్థలాన్ని నిర్ణయించాలి.

## అదృష్ట రత్నము

ఆరు సంఖ్య వారు శుక్రగ్రహానికి సంబంధించిన వజ్ర

రత్నాన్ని ఉంగరంలో, మెడ గొలుసులో లేదా గడియారం చెయిన్ మొదలైన వాటిలో పొదిగించి ధరిస్తే అన్ని వైపులా విజయము, లాభము సిద్ధిస్తాయి.

### అదృష్ట వర్ణము

ఈ సంఖ్యవారికి తెల్లరంగు, లేదా నీలిరంగు ప్రశస్తంగా ఉంటాయి. ఈ రంగులున్న వస్త్రాలను, ఆభరణాలను, తతిమ్మా వస్తువుల్ని వాడితే వీరికి ఎక్కువ పలుకుబడి వుంటుంది.

### అనుకూలమైన తేదులు

ఆరు సంఖ్యవారికి ప్రతినెల 6, 9, 15, 18, 24, 27 తేదులు అనుకూలంగా ఉంటాయి. అలాగే లో ముగిస్తున్న సమష్టి సంఖ్య వచ్చే తేదులు కూడా అనుకూలిస్తాయి. (అనగా 8-7-1962 వంటి తేదుల కూడిక వంటివన్న మాట) ఈ తేదులలో అనుకోకుండా కార్యజయము, ధనలాభము వస్తాయి.

### ప్రతికూలమైన తేదులు

పైన చెప్పిన 6 తేదులు తప్ప తతిమ్మా తేదులు ఏ పనీ మొదలు పెట్టడానికి పనికిరావు.

### గ్రహప్రీతి - గ్రహశాంతి

ఈ 6 సంఖ్యవారు శ్రీ లక్ష్మీ స్తోత్ర పఠనము, దుర్గా స్తోత్ర పారాయణము, శుక్రవారంలో సుమంగళి స్త్రీలకు ఫల తాంబూల దానము వంటివి చేస్తుంటే శుక్రగ్రహశాంతి, గ్రహప్రీతి కలిగి సర్వక్షేమాలూ లభిస్తాయి.

# 7

# ఏడు సంఖ్యా

సంఖ్యల వరుసలో తతిమ్మా సంఖ్యలు లాగనే ఏడు అనే సంఖ్యకు కూడా ప్రాధాన్యం ఉన్నది. భగవంతుని సృష్టిలో ఏడు సంఖ్యలు కలవి అనేకం ఉన్నాయి. సప్తఋషులు, సప్త సముద్రాలు, సప్తవర్షములు, సప్త కులపర్వతములు, సప్త ద్వీపములు ఇంకా ఇలా ఏడు సంఖ్యలో ప్రశస్తంగా ఉన్న ప్రపంచ పదార్థాలు చాలా ఉన్నాయి.

### ఏడు సంఖ్యవారు ఎవరు?

జనవరి మొదలుకొని డిశంబరు నెల వరకైన ఆంగ్లమాన సంవత్సరంలో ఏ నెలలోనైనా సరే, 7, 16, 25 ఈ తేదులు ఒక దానిలో జన్మించిన వారిని ఏడు సంఖ్యవారని గుర్తించాలి.

7-వ తేదీవారు ఏడు సంఖ్యవారని స్పష్టంగానే తెలుస్తున్నది.

16-వ తేదీలోని రెండు సంఖ్యలను 1 + 6 అని కూడితే 7 వస్తుంది.

అలాగే, 25-వ తేదీలోని సంఖ్యలు రెంటినీ 2+5 అని కూడితే వచ్చేది 7 సంఖ్యే.

అంచేత 7, 16, 25 తేదులలో దేనిలోనైనా పుట్టిన వారిని 7 సంఖ్యవారని గుర్తించి వారికి చెప్పబోవు ఫలితాలను చూచుకోవాలి.

## 7 సంఖ్యకు చెందిన గ్రహము

7 సంఖ్యకు చెందిన గ్రహం చంద్రుడని శాస్త్రజ్ఞులు నిర్ణయించి ఉన్నారు. 2 సంఖ్యకు చెందిన వాడు చంద్రుడన్న విషయం 2 సంఖ్య గురించి వివరించిన చోట చెప్పి ఉన్నాము. అంటే, 2-7 ఈ రెండు సంఖ్యలకూ చంద్రుడే అధిపతి.

ఒకే గ్రహము రెండు సంఖ్యలకు అధిపతిగా ఉంటే, జీవిత ఫలితాలలో కాని, ఈ సంఖ్య వ్యక్తులలోని గుణగణాలలో కానీ ప్రత్యేకతను ఎలా నిరూపించడం? ఈ విషయాన్ని శాస్త్రజ్ఞులు లందరూ బాగా విమర్శించారు. అలా విమర్శించి చంద్రుని స్వరూపాన్ని రెండు రకాలుగా — Negative అనీ Positive, అనీ పెట్టుకొని ఫలితాలు నిరూపించారు.

## 7 సంఖ్యవారి ఆకారము

గుండ్రని ముఖము, పొట్టివైన భుజాలు, గట్టిగా ఉన్న పాదాలు, కండరములతో కూడిన శరీరం, చామన చాయ, ఆకర్షకమైన అంగ సౌష్ఠవము ఇవన్నీ 7 సంఖ్యకు చెందిన వారి ఆకారము.

## గుణగణాలు

ఒక చోట నిలవని శరీరము, చంచలమైన మనస్సు ఇవి కలవారు. ఎప్పుడూ ఏదో ఒకటి చేసుకొంటూ మాటిమాటికి ప్రయాణాలు, యాత్రలూ పోతుంటారు. నమ్మినవారిని రక్షించాలని తహతహలు పడుతుంటారు.



గొప్ప గొప్ప ఆశయాలను పెట్టుకొని కలల కంటూ ఉంటారు. వీరి పోకడలను విమర్శించడంకంటే - వీరిని నిర్బంధించడం కంటే, వీరు చేస్తున్న పనులను వేస్తున్న ప్లానను ఆమోదిస్తుంటేనే వీరు మరింత ఉత్సాహంతో పనిచేసేవారు.

పరాయివారికంటే, తమ కుటుంబానికి చెందినవారినీ రక్త సంబంధం కలవారినీ ఎక్కువ ప్రేమిస్తారు.

వీరి జీవితంలో సుఖదుఃఖాలు, కష్టనష్టాలు, హెచ్చుతగ్గులూ చక్రంలా మారుతూ, వస్తూ పోతూ ఉంటాయి. వాటిని సహజ సంభవాలుగా ఎదుర్కొనే మనస్తత్వం వీరికి ఉంటుంది.

కళారసికులుగా, రచయితలుగా, కవులుగా, సంగీత రసికులుగా ఉన్నవారు పలువురు ఈ 7 సంఖ్యవారే అని తెలుసుకోవాలి.

## దాంపత్య జీవితం

వీరికి దాంపత్య జీవితం అంతగా సుఖదాయకమని చెప్పడానికి వీలుండదు. అయినా శాంతి పూర్ణంగా చేసుకోవాలనే వీరి ప్రయత్నం ఒకింత ఫలితాన్ని ఇవ్వక పోదు. తరచు ఎక్కువ అధ్యాత్మిక ప్రవృత్తి కలవారవటంవల్ల కుటుంబ సుఖాలకోసం అంతగా బాధలు పడేవారు కారు.

## ఆర్థిక పరిస్థితి

వీరికి ఆర్థిక పరిస్థితి, యావజ్జీవితమూ హెచ్చుతగ్గులు, లాభ

నక్షత్రాలతో ఉంటుంది. కాని, అవసరానికి ఎక్కణుంచో వచ్చి చిక్కులు తీరిపోవటంవల్ల నిలకడగా ఆర్థిక సౌష్ఠవం లేకపోయినా బాధపడేవారు కారు. రేసులు లాటరీలవంటి సులభోపాయాలవల్ల రెప్పపాటులో ధనవంతు లయిపోవాలని వీరు చేసే ప్రయత్నాలన్నీ విఫలమైపోతాయి. కాని, వ్యాపార రీత్యా వీరు చేసె ప్రయత్నాలు లాభదాయకంగా ఉంటాయి.

## ఆరోగ్యము

వీరికి అప్పుడప్పుడు చర్మానికి సంబంధించిన బాధలు, వ్యాధులు వస్తుంటాయి. పక్షవాతం వంటివి కూడా కొందరిని బాధించవచ్చు. శ్వాస సంబంధమైన రోగాలు కొన్ని సందర్భాలలో వస్తాయి. మలబద్ధకము లేకుండా చేసుకుంటే ఒకింత వ్యాధుల్ని అరికట్టవచ్చు.

## వృత్తి వ్యాపారాలు

ముఖ్యంగా 7 సంఖ్య వారికి వ్యాపార జీవితమే రాణిస్తుంది. నీటిలో పుట్టిన వస్తువులు, పడవల మూలకమైన వ్యాపారాలు, ద్రవపదార్థాలు, ఇంకా ఇటువంటివి చేస్తారు.

ఉద్యోగరంగంలోనివారు కొందరు ఆఫీసులలో సాధారణ వృత్తులు చేస్తుంటారు. ఇంట్లో, వంట ఇంటికి సంబంధించిన పనులు చేసే సేవకులుగా కొందరును, చేపలు పట్టేవారు కొందరును, ఇంకా ఇతర నీచవృత్తులు చేసేవారు కొందరును ఉంటారు.

## చంద్రుని కాలము

చంద్రునికి చెందిన వారం సోమవారం. రాత్రిపూట బలంకల వాడు. ఒక గంటకాలము చంద్రునికి చెందిన స్వల్పకాల పరిమితి.



## చంద్రుని దేశము

ఉత్తరదిక్కు చంద్రునికి చెందిన దిక్కు. నీటి సంబంధమున్న తటాకాలు, గుంటలు, బావులున్న ప్రదేశాలు, స్నానగది, తడి ప్రదేశాలు ఇవన్నీ చంద్రునికి చెందినవనాలి. ఈ అంశాలను బట్టి 7-సంఖ్య వారున్న ప్రదేశాన్ని, వారికి ప్రియమైన ప్రదేశాన్ని నిరయించుకోవాలి.

## అదృష్ట రత్నము

ముత్యము చంద్రునికి చెందిన రత్నమని జ్యోతిశ్శాస్త్రం తెలుపుతున్నది. కాని వజ్ర రత్నాన్ని కూడా చంద్రునికై ధరించవచ్చని విమర్శకులు తెలిపారు. అందుచేత, ముత్యాలు, వజ్రము వీటిలో దేన్నైనా ఉంగరంలో, మెడగొలుసులో పొదిగించి ధరిస్తే వ్యాధులు శాంతిస్తాయి. వ్యాపారరంగంలోను ఉద్యోగరంగంలోనూ లాభదాయకంగా ఉంటుంది.

## అదృష్ట వర్ణము

స్వచ్ఛమైన తెలుపు వర్ణము చంద్రుని రంగు. ఆకుపచ్చ రంగు కూడా చంద్రునికి చెందినదని శాస్త్రజ్ఞులు నిరూపించారు. అందుచేత, ఈ రంగుల వస్త్రాలను, లేదా ఈ రంగుల అంచులు గల గుడ్డలను ధరిస్తే సర్వత్రా విజయం లభిస్తుందని తెలుసుకోవాలి.

## అనుకూలమైన తేదులు

ఈ ఏడు సంఖ్య వారికి 2, 4, 11, 13, 20, 22, 25 ఈ తేదులు అనుకూలంగా ఉంటాయి. ఈ రోజులలో చేసే ప్రయత్నాలు అనుకూలిస్తాయి. తలవని తలంపుగా ధనలాభం ఉంటుంది.

పెద్దల దర్శనం, అందు మూలకమైన కార్యసిద్ధి ఇవన్నీ జరుగుతాయి.

గ్రహశాంతి—గ్రహప్రీతి

చంద్రగ్రహ ప్రీతికరంగా ఈ ఏడు సంఖ్యవారు దుర్గాదేవీ స్తోత్రాన్ని పఠించడం మంచిది. శ్రీ గణేశ పూజ, స్తోత్ర పఠనము కూడా చేయవచ్చు. వీటి మూలాన వ్యాపార వృద్ధి, కార్యసిద్ధి ఇవన్నీ కలుగుతాయి.

# 8

# ఎనిమిది సంఖ్య

ఒకటి మొదలుకొని తొమ్మిదివరకున్న సంఖ్యలలో ఎనిమిది సంఖ్య కూడా తనకున్న ముఖ్యత్వాన్ని తెలుపుతూనే ఉన్నది. ఎనిమిది సంఖ్యలోని ప్రపంచ పదార్థాలు, దేవతాస్వరూపాలూ అనేకం ఉన్నాయి. అష్టలక్ష్ములు, అష్టవసువులు, అష్టైశ్వర్యములు, మహాసిద్ధులు ఈ విధంగా ఎనిమిది సంఖ్యలోనివి చాలా ఉన్నాయి. శ్రీకృష్ణ పరమాత్మ అవతరించినది అష్టమి అనే ఎనిమిది సంఖ్య గల తిథిలోనే. అంచేత, ఎనిమిది సంఖ్యలో జన్మించిన వారిలో ఒక ప్రత్యేకత, విశిష్టత కనిపిస్తూనే ఉంటుంది.

## ఎనిమిది సంఖ్యవారు ఎవరు?

జనవరి మొదలు డిసెంబరు వరకైన పన్నెండు నెలల్లో ఏ నెలలోనైనా సరే, 8, 17, 26 ఈ తేదులు ఒక దానిలో జన్మించినవారు ఎనిమిది సంఖ్య వారనుకోవాలి.

8-వ తేదీన జన్మించిన వారు 8 సంఖ్య వారవటం స్పష్టంగానే తెలుస్తుంది.

17-వ తేదీలోని రెండు సంఖ్యలను 1+7 అని కూడితే వచ్చేది 8 సంఖ్యే ఔతుంది.

అలాగే 26-వ తేదీలోని సంఖ్యలోని రెంటిని 2+6 అని కూడితే 8 సంఖ్యే వస్తుంది.

అంచేత, 8, 17, 26, ఈ తేదులలో జన్మించిన వారిని 8 సంఖ్యవారని నిర్ణయించి వారికై చెబుతున్న ఈ క్రింది ఫలితాలను అన్వయింప చేసుకోవాలి.

## ఎనిమిది సంఖ్యకు చెందిన గ్రహము

ఎనిమిది సంఖ్యకు చెందిన గ్రహం శనిభగవానుడని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. శనైశ్చరుడు సూర్యపుత్రుడవటం వల్ల సూర్యని వారమైన ఆదివారానికి ముందు వస్తున్న రోజుకు (అనగా-శనివారానికి) అధిపతిగా ఉన్నాడు. అంటే, వారానికి తొలిరోజుకు సూర్యుడు అధిపతియైతే ఆఖరు రోజుకు అతని కుమారుడైన శనిభగవానుడు అధిపతిగా ఉన్న విషయం గుర్తించాలి. అంచేత 8 సంఖ్యవారికి శనిగ్రహం మూలాన వచ్చే ఫలితాలను చెప్పాలి.

వీరు చూడడానికి అంత ఎక్కువ ఎత్తుగా కాకుండా మధ్య రకంగా ఉంటారు. వీరి తలవెంట్రుకలు దళసరిగా ఉంటాయి. విశాలమైన భుజాలు, చిన్నకాళ్ళు, పెద్దచెవులు, నల్లని, లేదా చామని చాయ ఇవన్నీ ఉన్నవారిని 8 సంఖ్యవారని గుర్తుపట్ట వచ్చు.

## గుణగణాలు

శనిగ్రహాన్ని అధిపతిగా పెట్టుకొన్న ఈ 8 సంఖ్యవారు



నీతి నియమాలకు బద్ధులై ఉంటారు. వీరికి నిదానమే ప్రధానము. ఏ పనిని గానీ తీరా ఆలోచించకుండా చేసేవారు కారు. ఎప్పుడూ తలెత్తి పైకి చూడకుండా నేల మీదికే చూపులు పెడుతూ తలవంచు కొంటూ ప్రశాంతంగా నడిచి వెళ్ళేవారు.

దేవునిమీద, పెద్దలమీద, ఆఖరుకు తన మీద అమితమైన విశ్వాసం పెట్టుకొని వ్యవహరిస్తుంటారు.

ప్రశాంతంగా జీవితం గడపాలని నిర్ణయం కలవారైనసూ, ఎప్పుడైనా వ్యవహారాలు తగాయిదాలని వస్తే అందుకు వెనుకాడే వారు కారు.

కొన్ని సందర్భాలలో, వ్యవహారం చేస్తున్నవారికి మధ్య వర్తిగా ఉండి న్యాయసమ్మతంగా తీర్మానించి వారి తగాదాలు తీర్చే ధర్మాత్ములని పేరు పొందేవారు.

వీరితో విరోధం పెట్టుకొన్ననూ, స్నేహం పెట్టుకొన్ననూ వాటి రెంటినీ జీవితాంతం వరకు మరిచి పోయేవారు కారు. ఎవరైనా వీరిని పొగడితే, ఆ పొగడ్తలకు లోబడి, వారికి ఏమైన మంచి చేయాలని తహతహలు పడుతుండే వారు.

కాయ కష్టములు చేయడమంట వీరికి అమిత ప్రీతి. ఎంత పనైనా తొందరపాటు లేకుండా నిదానంమీద కొనసాగించేవారు.

వీరికి సంఘ జీవితం కంటే ఏకాంత జీవితమే ఇష్టము. అనేకరకాలుగా జీవిత విధానాలను పెట్టుకోవాలని వీరు యత్నించినా అవన్నీ వ్యర్థప్రయత్నాలైపోయి ఏదో ఒక రకమైన జీవితవిధానం లోకి అణిగి నిలిచి పోయేవారు. దానిమూలాన ప్రయత్నానికంటే దైవనిర్ణయమే బలవత్తరమైనదనే తీర్మానానికి వీరు వస్తారు.

## దాంపత్య జీవితం

ఎనిమిది సంఖ్యవారికి దాంపత్య జీవితం బాగానే ఉంటుంది. అనుకూలమైన భార్య లభిస్తుంది. ప్రేమ వ్యవహారంలో వీరికి అనుకూలత ఏమాత్రం ఉండదు. ప్రయత్నాలు విఫలమైన తరువాత తాను చేసింది న్యాయంకాదని తెలుసుకొనే న్యాయ వర్తనము వీరిలో ఉండి మనస్సును సమాధాన పరుస్తుంది.

## ఆర్థిక పరిస్థితి

వీరికి ఆర్థిక పరిస్థితులు హెచ్చుతగ్గులతో ఉంటాయి. కొన్ని సమయాలలో ఎక్కువ నష్టము వచ్చినా ఆఖరుకు అది చక్కపడుతుంది. ముప్పై ఏండ్లవరకు కొంత శ్రమ ఉండినా తరువాత వీరి జీవితం బాగుపడుతుంది. అప్పణ్ణుంచి సకల సుఖాలూ అనుభవించేవారు.

## ఆరోగ్యము

ఎనిమిది సంఖ్యలోని వారికి జీర్ణాశయ సంబంధమైన వ్యాధులు, కడుపునొప్పులు, నరాలకు సంబంధించిన రోగాలు వస్తుంటాయి. పండ్లనొప్పితో అప్పుడప్పుడు బాధలుపడేవారు. కుష్ఠురోగంతోనూ. ఇంకా కొన్ని చర్మరోగాలతోనూ బాధ పడేవారు కొందరుంటారు. చెవిటివారు కూడా కొందరు 8 సంఖ్య లోని వారుంటారు. ఇవిగాక రక్తసంబంధమైన రోగాలతో కొందరికి కొన్ని జబ్బులు రావచ్చు.

## వృత్తి వ్యాపారాలు

స్వతంత్ర వృత్తికంటే సేవకవృత్తిలో ఉన్నవారే ఎక్కువ ఉంటారు. వ్యవసాయ వృత్తిలో నున్నవారు మెండు.



భూములు భవనాలు వీటితో సంబంధం పెట్టుకొన్న గొప్ప గొప్ప కంట్రాక్టర్లు, గొప్ప భూస్వాములు నేలబొగ్గులు ఇతర ఖనిజములు వీటితో వ్యాపారం చేసేవారు, గొప్ప భూగర్భ శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు ఇటువంటి వాటితో వ్యాపారములుగాని, కొలువులుగాని ఈ ఎనిమిది సంఖ్యకు చెందినవారు చేసేవారు.

## శనిగ్రహ కాలము

శనివారము శనిగ్రహానికి చెందిన వారము. డిశంబరు 22-వ తేది మొదలుకొని జనవరి 19-వ తేదివరకైన కాలము శనైశ్చరునికి చెందినది. ఈకాలములో జనించిన 8 సంఖ్యవారు మరింత భాగ్యవంతులుగా ఉంటారు. రాత్రిపూట బలం కలవాడు శనిభగవానుడు. కాలపరిమితిలో ఒక సంవత్సరకాలము వీనిది.

## శనిగ్రహ దేశము

దక్షిణము, లేదా ఆగ్నేయము శనికి చెందిన దిక్కు. అంచేత ఎనిమిది సంఖ్యవారు ఈ దిక్కుల ముఖంగా ప్రయాణాలు చేసి ననూ ఈ దిక్కులు చూస్తూ కూర్చుని పనులు చేసిననూ తప్పక కార్యసిద్ధి, అధికారవృద్ధీ లభిస్తాయి. గుహలు, స్మశానవాటికలు, గనులు, ఎడారి ప్రదేశాలు, పాతకట్టడాలు ఇంకా అశుభమైన ప్రదేశాలు, ఇవన్నీ శనిగ్రహానికి చెందిన ప్రదేశాలు. వీటిని బట్టి ఈ 8 సంఖ్యవారు నివసిస్తున్న లేదా సంచరిస్తున్న ప్రదేశాలను నిర్ణయించుకోవాలి.

## అదృష్ట రత్నము

నీల రత్నము శని భగవానునికి చెందిన రత్నము. బాగా

పరీక్షించిన నీల రత్నాన్ని ఉంగరము, లేదా మెడగొలుసులో పొదిగించి ధరిస్తే అదృష్టకరంగా ఉంటుంది. తల పెట్టిన పను లలో విజయం లభిస్తుంది.

## అదృష్ట వస్త్రము

ఎనిమిది సంఖ్యకు చెందిన శని గ్రహానికి నలుపు రంగని శాస్త్రజ్ఞులు చెప్పారు. అంచేత ఈ సంఖ్య వారు స్త్రీలైతే, నలుపు చీరలు ధరిస్తే ఉత్తరోత్తరం ఎక్కువ అదృష్టాలు వస్తాయి. మగవారు నలుపు అంచులున్న వస్త్రాలను, లేదా నల్ల కోటు సూటులను ధరిస్తే మంచి ఆకర్షణ, పలుకుబడి, ఇష్టకార్యజయము ఇవన్నీ వస్తాయి.

## అనుకూలమైన తేదులు

ఎనిమిది సంఖ్య వారికి ప్రతి నెలలోనూ 1, 10, 19, 28 ఈ తేదులు చాలా అనుకూలంగా ఉంటాయి. అంచేత ఈ తేదు లలో క్రొత్తగా ఏ పనినైనా మొదలుపెట్టవచ్చు. పెద్దల్ని కలుసు కోవచ్చు. ఈ రోజులలో ఎక్కువ ఆదాయము, లాభము ఉంటుంది. 8, 17, 26 తేదులు కూడా మంచివే, కాని అవి దైవిక కార్యాలకు విజయాన్నిచ్చే తేదులు.

## ప్రతికూలమైన తేదులు

పైన చెప్పిన తేదులు రాకుండా తతిమ్మా తేదులు ప్రతి కూలంగా ఉంటాయి. ఆ తేదులలో ఏవీ క్రొత్తగా మొదలు పెట్ట కుండడమే బాగు.



## గ్రహప్రీతి – గ్రహశాంతి

ఎనిమిది సంఖ్య వారు శనికి ప్రీతికరంగా శని స్తోత్ర పారాయణము, శనివార వ్రతము, దుర్గా స్తోత్ర పఠనము, శ్రీ వేంకటేశ దర్శనము, నవగ్రహ ప్రదక్షిణము, శనిగ్రహానికి మంచి నూనె దీపారాధన ఇవన్నీ చేస్తుంటే గ్రహప్రీతి కలుగు తుంది.

---

# 9

## తొమ్మిది సంఖ్య

సంఖ్యలలో అఖరు సంఖ్యగా ఉన్న ఈ తొమ్మిది సంఖ్యకు తతిమ్మా సంఖ్యలులాగానే ఒక ప్రత్యేకత ఉండినా, వాటికంటే ఒక ప్రశస్తతకూడా ఉన్నదని ప్రపంచంలోని సంఖ్యాశాస్త్రజ్ఞులు, గణిత శాస్త్రజ్ఞులు గుర్తించారు. జ్యోతిషశాస్త్ర రీత్యా 9-వ స్థానం భాగ్యస్థాన మంటారు. అంచేత తొమ్మిది ఎప్పుడూ అభివృద్ధినే తెలుపుతుంది తొమ్మిది సంఖ్యను ఏ సంఖ్యతో గుణించినా అఖరున వచ్చేది 9 సంఖ్యే.

$9 \times 2 = 18 = 1 + 8 = 9$

$9 \times 4 = 36 = 3 + 6 = 9$

$4586 \times 9 = 41274 = 18 = 1 + 8 = 9$

ఈ విధంగా ఎంత పెద్ద మొత్తాన్నైనా 9 తో గుణిస్తే అ తొమ్మిదే అఖరు సంఖ్యగా మిగులుతుంది. గాక, తొమ్మిది సంఖ్యలో ప్రపంచ పదార్థాలు చాలా ఉన్నాయి. నవనిధులు, నవరసాలు, నవరత్నాలు, నవధాన్యాలు, నవగ్రహాలు ఇంకా అనేక పదార్థాలు తొమ్మిది సంఖ్యలోనివి ఉన్నాయి. ఇవన్నీ ప్రశస్తమైన పదార్థాలనే విషయాన్ని గుర్తించాలి.



### 9 – సంఖ్య వారు ఎవరు ?

ఏ నెలలోనైననూ సరే, 9, 18, 27 ఈ తేదులలో ఏదైనా ఒక తేదిలో పుట్టిన వారు 9 సంఖ్యవారే.

9-వ తేదీ తొమ్మిది సంఖ్య అనేది స్పష్టము.

18-వ తేదీలోని ఈ సంఖ్యలను 1 + 8 అని కూడితే 9 వస్తుంది.

అలాగే 27-వ తేదీలోని సంఖ్యలను 2 + 7 అని కూడితే వచ్చేది 9 సంఖ్యే.

అంచేత 9, 18, 27 తేదులలో ఒకదానిలో పుట్టినవారు 9 సంఖ్య వారని నిర్ణయించుకోవాలి.

### 9 సంఖ్యకు చెందిన గ్రహము

తొమ్మిది సంఖ్యకు చెందిన గ్రహము కుజుడని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. అంచేత, కుజుడే 9 సంఖ్యకు చెందిన వాడని తెలుసుకోవాలి. శరీరానికి ఆధారంగా ఉన్న రక్తమాంసములు కుజునికి చెందినవే. అందుచేత, మానవ జీవితానికి ఆధార భూతుడుగా ఉన్న కుజుడికి జ్యోతిశ్శాస్త్రంలో వివరించిన స్వరూప స్వభావాలను గుణగణాలను తెలుసుకొందాం.

### 9 సంఖ్యవారి ఆకారం

మంచి గంభీరమైన ఆకారంతో, మధ్య రకమైన ఎత్తుతో ఈ 9 సంఖ్య వారుంటారు. కండర పుష్టితో, లావాటి ఎముకలతో మంచి ఆకార పూర్ణులుగా కనిపిస్తారు. తీక్షణంగా ఉన్న చూపులు,

ఎర్ర తిరిగిన వెంట్రుకలు, ఒంట్లో దెబ్బలు, గాయాలు వీటి చిహ్నాలు ఉన్న వారిని 9 సంఖ్యకు చెందిన వారని గుర్తించాలి.

## గుణగణాలు

ముఖ్యంగా ఈ సంఖ్య వారిలో ధైర్య సాహసాలను ఎక్కువగా చూడవచ్చు. సాహసించి ఏ పనిలోనైనా ప్రవేశించే వారు. జయ పరాజయాలను ముందు ఆలోచించుకొన్న తరువాత ప్రవేశించడమనేది వీరికి అలవాటులేని స్వభావం. తలపెట్టిన పనులలో అపజయం వస్తే అందుకని కించిత్తైనా మనసులో కలవరం పెట్టుకోకుండా ఏమీ జరగని వారిలా ఉండిపోతారు.

ఈ సంఖ్యవారు తమ వృద్ధాప్య దశలో కూడా ఎటువంటి అలస్యంకానీ లేకుండా చురుకుదనంతో కనిపిస్తుంటారు.

వీరి మనస్సులో ఒకటి, మాటలలో ఒకటి అనే పద్ధతి ఉండదు. ఏదైనా వ్యవహారంలో పొరపాట్లుంటే జగడాలు పెట్టుకోవటానికైనా వెనుకాడేవారు కారు. ఇటువంటి వారితో జాగ్రత్తగా మెలగాలి.

క్రొత్త క్రొత్త విమర్శలు, పరీక్షలు చేయటమంటే వీరికి ప్రీతి ఎక్కువ.

ఈ సంఖ్యలోని వారు స్త్రీలైతే వారి మనోభావం ఏలాటిదని కనుక్కోవడం కష్టం. అయినా, మొత్తంమీద సద్గుణాలు, సహనము కలవారుగా రాణిస్తుంటారు.

## దాంపత్య జీవితం

వీరు ప్రేమ వ్యవహారాలలో పరంపరగా వస్తున్న నీతి



నియమాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తారు. అందువలన, తమ ప్రతిష్ఠకు భంగంకూడా కలుగవచ్చును. అయినా వాటిని పాటించే స్వభావం వారికుండదు. వారి కుటుంబజీవితం అంతగా ప్రశాంత మనటానికి వీలుండదు. వీరికున్న ముక్కోపంమూలాన దంపతుల మధ్య చెలరేగే తగాదాలు ఒకవిధంగా శాంతిస్తాయి.

## ఆర్థిక పరిస్థితి

వీరికి ఆర్థిక పరిస్థితి ఎక్కువ తృప్తికరంగా ఉండదు. కాని అవసరానికి కావలసిన డబ్బు అందుబాటులో ఉంటుంది. ఎక్కువ ఖర్చులుపెట్టే స్వభావం కలవారవటంవల్ల అప్పుడప్పుడు ఆర్థికంగా వెనుకాడుతుంటారు.

## ఆరోగ్యము

వీరికి అంతగా ఆరోగ్యం చెడదు. అయినా, అనేక సందర్భాలలో నరముల దౌర్బల్యంవల్లనూ, తలనొప్పుల వల్లనూ బాధలు పడుతుంటారు. కొందరికి కడుపు నొప్పులు, మూత్రాశయానికి సంబంధించిన వ్యాధులూ అప్పుడప్పుడు ఏర్పడుతాయి. మొత్తంమీద తొమ్మిది సంఖ్యవారికి ఒంట్లో అప్పుడప్పుడు గాయాలు దెబ్బలు తగులుతుంటాయి. ఇది ఒక సహజ సంభవంగా ఉండినా దైవ ప్రార్థనల మూలాన వీటిని తగ్గించుకోవచ్చు.

## వృత్తి వ్యాపారాలు

అంగారక గ్రహాధిపత్యం కలిగిన ఈ 9 సంఖ్యలవారు అనేకులు ఆయుధాలు ధరిస్తున్న మిలిటరి, పోలీసువంటి సాహస కృత్యాలు చేసే కొలువులలో ఉంటారు. బహుశః ఈలాటి ఉద్యోగాల్లోనే వీరు బాగా రాణిస్తారు. కొందరు ప్రభుత్వోద్యోగస్థులు కూడా ఈ కోవకు చెందినవారే. వైద్యశాఖలో డాక్టరుగా పని

చేసే వారు, ఆపరేషన్లు చేయటంలో సమర్థులైన సర్జన్లు ఇలా కొందరు రాణిస్తారు.

ఇవిగాక, అగ్నితో - విద్యుచ్ఛక్తితో సంబంధం పెట్టుకొన్న గొప్ప గొప్ప ఫ్యాక్టరీలు, రైల్వేలు వీటిలో పని చేసేవారు, మోటార్లు, లారీలు నడిపే డ్రైవర్లు మొదలైన వారిలో కూడా ఈ 9 సంఖ్యవారు పలువురు ఉంటారు.

గొప్ప గొప్ప భవనాలను, ప్రాజెక్టులను, వారధులను మొదలైన వాటిని నిర్మాణంచేసే ఇంజనీర్లు కూడా కొందరు ఈ సంఖ్య వారిలో ఉంటారు.

### కుజుని కాలము

మంగళవారము కుజునికి చెందిన వారము. మార్చి నెల 21వ తేది మొదలు ఏప్రిల్ నెల 19వ తేదీ వరకైన ఒక నెల కాలము కుజునికి సంబంధించినది. కనుక, బహుశః ఈ సంఖ్య వారు ఈ తేదీల మధ్య పుట్టిన వారుగా ఉండవచ్చు. రాత్రిపూట బలం కలవాడు కుజుడు. కాల పరిమితిలో ఒక దినము కుజునికి చెందిన కాలము.

కుజునికి సంబంధించిన కాలంలో దేనినీ మొదలు పెట్టకుండా ఉండడమే మంచిది. యంత్రాలు, అగ్నిసంబంధమైన కార్యాలను మంగళవారంలో కుజహోరలో చేయవచ్చు.

### కుజుని దేశము

కుజుని దిక్కు దక్షిణము. కుజహోరలో దారపోయిన వస్తువులు దక్షిణంలో దొరుకుతాయి. వంటశాల, కసాయి అంగళ్ళు,



యుద్ధ స్థలములు వంటివి కుజునికి చెందిన పదేశాలు. వీటినిబట్టి ఈ సంఖ్య వారు నివసిస్తున్న, లేదా పనిచేస్తున్న ప్రదేశాలను నిర్ణయించాలి.

### కుజుని రత్నము

కుజుని రత్నము పగడము. కుజగ్రహదోష నివృత్తికీ, కార్యసిద్ధికీ బాగా పరీక్షించిన పగడాన్ని ఉంగరము, మెడగొలుసు వంటి వాటిలో పొదిగించి ధరించడం మంచిది. వాటిమూలాన అన్నివైపులా విజయమే సిద్ధిస్తుంది.

### కుజుని వర్ణము

కుజుని వర్ణము రక్తవర్ణము. అనగా నెత్తురువంటి ఎర్రని వర్ణము. అంచేత ఈ రంగులో వస్త్రాలను, ఆభరణాలను ధరిస్తే చాలా అదృష్టదాయకంగా ఉంటుంది.

### అనుకూలమైన తేదులు

ఏ నెలగా ఉండినా సరే_9 సంఖ్యవారికి 2, 3, 7, 9, 11, 12, 18, 20, 21, 25, 27, 29, 30 ఈ తేదులు అనుకూలమైన తేదులు. ఈ తేదులలో మొదలుపెట్టే ఏ పనియైనను విజయాన్నిస్తుంది.

### ప్రతికూలమైన తేదులు

తతిమ్మా తేదులు ప్రతికూలంగా ఉంటాయి. వాటిలోనూ 6, 15, 24 ఈ తేదులు చాలా ప్రతికూలంగా ఉంటాయి అంచేత ఈ తేదులలో ఏలాటి కొత్త ప్రయత్నాలూ చేయరాదు.

### గ్రహశాంతి – గ్రహప్రీతి

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి స్తోత్రాలను పఠించడంతో అభిషేక _ అర్చనలూ చేస్తుండడం వీరికి కార్యసిద్ధిని ఇస్తుంది.

---

# వధూవరులకు పెండ్లి పొంతనాలు

సామాజిక జీవితంలో వివాహానికి ప్రాధాన్యత ఉన్నది. శరీరానికీ హృదయానికీ ఆనందాన్నిచ్చే వివాహ జీవితం బాగుండాలి. అంచేత జ్యోతిశ్శాస్త్ర రీతిగాను, సాముద్రిక లక్షణాల రీతిగాను పెండ్లి కావలసిఉన్న వధూవరులకు పొంతనములు చూచే పద్ధతి ఈనాడు కూడా మన ఆచరణలో ఉన్నది. అందచందంలోను ఐశ్వర్యంలోనూ దంపతులకు పొందిక చూడడం కంటే, దాంపత్య జీవితంలో వీరికి అన్యోన్యత ఉంటుందా, లేదా అని పరీక్షించి నిర్ణయించడంలోనే ఈ శాస్త్రాలన్నీ మార్గదర్శకంగా ఉన్నాయి.

ఈ సంఖ్యా శాస్త్రరీతిగా కూడా వధూవరులకు పొంతనము చూచే పద్ధతి ఉన్నది. అంటే, ఒక నిర్దిష్టమైన సంఖ్యావారికి, ఆ సంఖ్యకు అనుకూలమైన సంఖ్య కలవారితో పొంతనము కుదర్చకుండా, ఆ సంఖ్యకు విరుద్ధమైన సంఖ్య కలవారితో పెండ్లి కుదిరిస్తే, ఆ దంపతుల మధ్య అన్యోన్యత లేకపోయి, ఆ దాంపత్యజీవితం నరకప్రాయంగానే ఉండిపోతుంది. అంచేత అనుకూలమైన సంఖ్య గల వరుణ్ణి, లేదా కన్యకను ఎన్నుకొనే విధానాన్ని ఈ క్రింది విధంగా నిర్ణయించుకోవచ్చు:—

## పొంతనము చూచు విధము

ఒక నిర్దిష్టమైన సంఖ్య వారికి మరో సంఖ్య వారితో పొంతనము చూడవలసి ఉన్నప్పుడు వారు ఇద్దరూ పుట్టిన ఇంగ్లీషుతేదిని బట్టి చూడవచ్చు. కాని, అంతకంటే వారు పుట్టిన ఇంగ్లీషుతేదీ, నెల, సంవత్సరం వీటన్నిటినీ కలిపిన సమిష్టి సంఖ్యను బట్టి పొంతనము కుదర్చడమే ఉత్తమ పక్షమని సంఖ్యా శాస్త్రజ్ఞులు నిర్ణయించారు.



ఉదాహరణకు:—

వరుడు పుట్టిన తేదీ: 1 - 4 - 1949

వధువు పుట్టిన తేదీ: 4 - 6 - 1951

వీటిలో ఒకటవ తేదీన పుట్టిన ఒకటి సంఖ్యగల వరుడికి 4 వ తేదీన పుట్టిన కన్యక సరిపడుతుంది. ఎందుకంటే, 1 సంఖ్యకు 4 వ సంఖ్య అనుకూల సంఖ్య. అంచేత, తేదీ సంఖ్యను మాత్రం పెట్టుకొంటే ఈ వివాహం కుదురుతుంది. కాని, తేదీ, నెల, యీ సంవత్సరముల సమిష్టి సంఖ్యలు ఈక్రింది విధంగా ఉంటాయి.

వరుడు: 1+4+1+9+4+9=28=2+8=10=1+0=1

వధువు: 4+6+1+9+5+1=26=2+6=8

అనగా, 1 సంఖ్యగల వరునికి 4, 6, 7 ఈ సంఖ్యగల వధువు అనుకూలురాలు. అంచేత 8 సంఖ్యగల కన్యకు కుదరదు.

అదే విధంగా 8 సంఖ్యగల కన్యకకు 2, 4, 5 సంఖ్యగల వరుడు మట్టుకే అనుకూలంగా ఉంటాడు. కనుక 1 సంఖ్య వరుడు ప్రతికూలుడు. ఇదే విధంగా తతిమ్మా సంఖ్యల వారికి పొంతనం చూచుకోవాలి. ఇక వరుసగా 1 మొదలు 9 వరకున్న సమిష్టి సంఖ్యలవారికి పొంతనమున్న సంఖ్యలను తెలుపుతున్నాం:—

### 1 - సంఖ్యవారు

పుట్టినతేది, నెల, సంవత్సరం వీటి సమిష్టి సంఖ్య ఒకటిగా గల వరుడు, లేదా కన్యకకు:—

4, 6, 7 సంఖ్యలవారు పొంతనము కలవారు.

2, 3, 5, 8, 9 సంఖ్యలవారు పొంతనము లేనివారు.

పై విధంగా పొందికగల 4, 6, 7 సంఖ్యల వారిలో 4 సంఖ్యవారు తతిమ్మావారికంటే ఎక్కువ పొందిక గలవారు. అంచేత 4 సంఖ్యవారిని పెండ్లి చేసుకొంటే జీవితానికి అవసరమైన అన్ని వసతులతోనూ ఆనందంగా దాంపత్య జీవితం గడుస్తుంది.

### 2 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 2 గా ఉన్నవారికి —

3, 5, 8 సమిష్టి సంఖ్యవారు అనుకూలురు.

1, 2, 4, 6, 7, 9 సంఖ్యలవారు ప్రతికూలురు.

అంచేత 3, 5, 8 సంఖ్యవారితోనే పెండ్లి కుదర్చడం మంచిది. ఈ ముగ్గురిలో 5 సంఖ్యగల వారిని పెండ్లి చేసుకొంటే చాలా మంచిది.

### 3 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 3 గా ఉన్నవారికి —

6, 8, 9 సమిష్టి సంఖ్యలవారు అనుకూలురు.

1, 2, 3, 4, 5, 7 సమిష్టి సంఖ్యలవారు ప్రతికూలురు. అంచేత పై 6, 8, 9 సంఖ్యవారితో పెండ్లి చేయాలి. ఈ 6, 8, 9 సంఖ్యలలో 6, 8 సంఖ్యవారితో పెండ్లి కుదిరితే పెండ్లయిన తరువాత అన్ని భాగ్యాలూ పెరుగుతాయి.

### 4 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 4 గా ఉన్నవారికి —

1, 7, 9 సమిష్టి సంఖ్య గలవారు అనుకూలురు.



2, 3, 5, 6, 8 సంఖ్య గలవారు ప్రతికూలురు.

అంచేత 1, 7, 9 సమిష్టి సంఖ్య గలవారితో పెండ్లి సంబంధం పెట్టుకోవాలి. ఈ మూడు సంఖ్యలలో తతిమ్మా వాటి కన్న 7 సంఖ్య గలవారిని పెండ్లి చేసుకుంటే జీవితంలో ఉత్తరోత్తరం అభివృద్ధికరంగా ఉంటుంది.

### 5 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 5 గా ఉన్నవారికి—

2, 3, 8 సమిష్టి సంఖ్యలవారు అనుకూలురు.

1, 4, 5, 6, 7, 9 సంఖ్యలవారు ప్రతికూలురు.

అంచేత 2, 3, 8 సంఖ్యల వారినే పెండ్లి చేసుకోవాలి. వీరిలో 8 సంఖ్యకన్నా 2, 3 సంఖ్యల వారిని పెండ్లాడితే తలవని తలంపుగా ధనలాభం వస్తుంది. ఉద్యోగంలో తలవని తలంపుగా ప్రమోషను లభించడమే కాకుండా, భూమి ఇల్లువంటి స్థిరాస్తులు కూడా వస్తాయి.

### 6 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 6 గా ఉన్నవారికి—

3, 6, 9 సమిష్టి సంఖ్యలవారు అనుకూలురు.

1, 2, 4, 5, 7, 8 సమిష్టి సంఖ్యలవారు ప్రతికూలురు.

అంచేత 3, 6, 9 సమిష్టి సంఖ్యల వారిని పెండ్లి చేసుకోవడం ప్రశస్తము. ఈ మూడు సంఖ్యలలోనూ 6 సంఖ్య వారిని పెండ్లాడితే సకల సౌభాగ్యాలూ సిద్ధిస్తవి. పురోభివృద్ధిని కూడా ప్రసాదిస్తుంది.

## 7 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 7 గా ఉన్నవారికి—

1, 4, 8 ఈ సమిష్టి సంఖ్యలవారు అనుకూలురు.

2, 3, 5, 7, 9 ఈ సమిష్టి సంఖ్యలవారు ప్రతికూలురు.

అందుచేత, 1, 4, 8 సమిష్టి సంఖ్యల వారినే పెండ్లి చేసుకోవాలి. వీరిలో 1 సంఖ్య కలవారి మూలకంగానే సకల సౌఖ్యాలూ చేకూరుతవి. దంపతుల మధ్య విశేషమైన అన్యోన్యత ఉంటుంది.

## 8 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 8 గా ఉన్నవారికి—

2, 4, 5 సమిష్టి సంఖ్యవారు అనుకూలురు.

1, 3, 6, 7, 8, 9 ఈ సమిష్టి సంఖ్యవారు ప్రతికూలురు.

అందువల్ల 2, 4, 5 సంఖ్యవారిని వివాహం చేసుకోవాలి. ఈ మూడు సంఖ్యలవారిని ఎవరిని పెండ్లాడినా సమానమైన ఫలితమే ఉంటుంది.

## 9 - సంఖ్యవారు

సమిష్టి సంఖ్య 9 గా ఉన్నవారికి—

3, 6, 7 ఈ సమిష్టి సంఖ్యలవారు అనుకూలురు.

1, 2, 4, 5, 8, 9 సమిష్టి సంఖ్యలవారు ప్రతికూలురు.

అందుచేత, 3, 6, 7 సంఖ్యగల వారినే పెండ్లి చేసుకోవాలి. వీరిలో 3 సంఖ్యవారు చాలా అదృష్టవంతులు.



# లాటరీలు రేసులు

## ప్రైజులు వచ్చే అవకాశాలు

ఈనాడు లాటరీలు, ప్రైజులూ ఇవి ఎక్కువగా ప్రజలను ఆకర్షించే ఆర్థిక విధానాలు. నిరుపేద మొదలుకొని సంపన్నుల వరకు అందరూ ఈనాడు లాటరీ టిక్కెట్లు కొంటున్నారు. కాని, లక్ష మందిలో ఒకరికి మాత్రమే ఆ అదృష్టయోగం పడుతుంది.

సంఖ్యాశాస్త్ర రీతిగా లాటరీలలో ప్రైజులు వచ్చే అవకాశాన్ని సూచించే పద్ధతులు లేకపోలేదు. ఈ పద్ధతుల్ని అవలంబిస్తే అదృష్టయోగం అందుబాటులో ఉంటుంది. కాని పూర్వ పుణ్యార్జితంగా వచ్చే అదృష్టయోగం అందరికీ సమానంగా ఉండదు. పుణ్యబలం ఎక్కువ కలవారికి ఈ అవకాశం సులభమై పోతుంది.

అందుచేత, సంఖ్యా శాస్త్రరీతిగా మంచి అవకాశం చూచుకొని లాటరీ టిక్కెట్లు కొనుగోలు చేసినా, కొన్ని సందర్భాలలో ఫలితం లేకుండా పోవచ్చు. అందుకు కారణం, లాటరీలలో పాల్గొనే మరొకరి పుణ్యబలం ఎక్కువగా ఉండడమే. అందుచేత, ఈ పద్ధతిని విడువకుండా అనుసరిస్తూంటే, తనకన్న పుణ్యబలం ఎక్కువ కలవారు పాల్గొనకుండా ఉన్నప్పుడు ఈ అదృష్ట స్వర్ణ కవాటము తటాలున తెరుచుకొంటుంది.

## లాటరీలు, రేసులలో విజయావకాశాలు తెలిపే పట్టిక

ఇక, లాటరీలు, రేసులు వాటిలో వారివారి పుట్టిన తేదీ సమిష్టి సంఖ్యలనూ, ఆ సంఖ్యలకు ప్రతినెలా అదృష్టాన్నిచ్చే తేదులనూ, టిక్కెట్లలోని సంఖ్యల కూడికవల్ల వచ్చే అధార సంఖ్యను క్రింద సూచించిన పట్టికలో చూచుకొని అవిధంగా వాటిలో పాల్గొనవచ్చు.

| పుట్టిన తేదీ, నెల, సం॥ వీటి సమిష్టి సంఖ్య | లాటరీలు, రేసులు వగైరా లలో అదృష్టాన్నిచ్చే తేదులు | అదృష్టాన్నిచ్చే, (లేదా ఇవ్వగల) టిక్కెట్లు మొదలైన వాటి సమిష్టి సంఖ్యలు (అధారసంఖ్య) |
|---|---|---|
| 1 | 4, 13, 22, 31 | 1, 4, 5, 7 |
| 2 | 1, 7, 16, 25 | 1, 5, 6, 8 |
| 3 | 3, 6, 18, 30 | 3, 6, 7, 9 |
| 4 | 1, 10, 19, 18 | 1, 4, 7, 8 |
| 5 | 9, 14, 23, 27 | 2, 5, 7, 9 |
| 6 | 6, 15, 24, 30 | 1, 3, 6, 9 |
| 7 | 2, 11, 20, 29 | 1, 2, 4, 8 |
| 8 | 5, 10, 15, 23 | 1, 2, 6, 8 |
| 9 | 2, 11, 20, 29 | 2, 3, 6, 7 |

ఉదా॥ ఒక టిక్కెట్టు సంఖ్య 17264 అని ఉంటే వీటి సమిష్టి సంఖ్య 2. ఈ సంఖ్య 5, 7, 8, 9 సమి ష ంఖ్యలకు ఎదురుగా ఉండబట్టి, 5, 7, 8, 9 సమిష్టి సంఖ్యల వారికి అదృష్టాన్ని ఇస్తుంది.



### పుట్టిన తేదీనిబట్టి

# ముఖ్య సంభవాలు జరిగే వయస్సు

ఈ భూమండలంలో ప్రతి వ్యక్తి జనించిన తేదీని ఆధారంగా పెట్టుకొని వాని జీవితంలో అదృష్టయోగము, ముఖ్య సంభవాలూ జరిగే వయసును ఈ క్రింది పట్టికలో చూచుకోవచ్చు.

| ఏ నెలలోనైననూ ఒకరి పుట్టినతేది | నిర్దిష్టమైన నెలలు (పుట్టిన నెలలు) | ముఖ్య సంభవాలు జరిగే వయస్సు |
|---|---|---|
| 1, 10, 9, 28 | జనవరి, జూలై, ఆగష్టు | 1, 7, 10, 16, 19, 28, 34, 37, 43, 46, 52, 55, 61, 70. |
| 2, 11, 20, 29 | — Do — | 2, 7, 11, 16, 20, 25, 29, 34, 38, 43, 47, 52 56, 70. |
| 3, 12, 21. 30 | ఫిబ్రవరి, డిశంబరు | 3, 12, 21, 30, 39, 48, 57, 66, 75. |
| 4, 13, 22, 31 | జనవరి, జూలై, ఆగష్టు | 1, 4, 7, 10, 13, 19. 22, 28, 31, 37, 40, 46, 49, 55, 58, 64, 67, 73, 76. |
| 5, 14, 23 | జూన్, సెప్టెంబరు | 5, 14, 23, 32, 41, 50, 59, 68, 77. |
| 6, 15, 24 | మే, అక్టోబరు | 6, 15, 24, 33, 42, 51, 60, 69, 78, 87. |
| 7, 16, 25 | జనవరి, జూలై, ఆగష్టు | 2, 7, 11, 16, 20, 25, 29, 34, 38, 42, 51, 60, 69, 78, 87 |
| 8, 17, 26 | జనవరి, ఫిబ్రవరి, జూలై, ఆగష్టు | 8, 17, 26, 35, 44, 53, 62, 71, 80. |
| 9, 18, 27 | ఏప్రిల్, అక్టోబరు, నవంబరు | 9, 18, 27, 36, 45, 54, 63, 72, 81. |